





# కథలు

నీతి, పురాణ, పొడుపు

# బొమ్మల గలివర్ సాహసయాత్ర





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120000077

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

బొ మ్మ ల

# గలివర్ సాహసయాత్ర

ఎస్. కె. వెంకటాచార్యులు

నవరత్న బుక్ సెంటర్
ఏలూరు రోడ్, విజయవాడ-520002

# గలివర్ సాహసయాత్ర

నాపేరు గలివరు. నేను మా తండ్రికి పుట్టిన అయిదుగురు కుమారులలో మూడవ వాడను. మా నాన్న ఒకపాటి ఆస్తిపరుడు. అందువలన అతడు తన కుమారుల చదువుకోసం అవసరమయినంతగా డబ్బు ఖర్చుపెట్టేవాడు. నేను పాఠశాల చదువును ముగించింతరువాత, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో చేరాను. అక్కడ మూడు సంవత్సరాల కాలం గడిపాను. పిమ్మట ప్రసిద్ధిచెందిన సర్జన్ దగ్గర చదువుకోటానికి లండన్ వెళ్ళాను.

ఆ రోజుల్లో మా నాన్న నా సొంత ఖర్చులకోసం అప్పుడప్పుడు కొంత డబ్బు పంపుతుండేవాడు. నేను ఆ సొమ్మును వృధా వ్యయం చేసేవాడను కాను. గణిత శాస్త్రానికి సంబంధించిన పరికరాలను, నౌకాయానానికి సంబంధించిన పుస్తకాలను కొంటుండేవాడను. నా విరామకాలంలో ఆ పుస్తకాలను చదువుతుండేవాడను

పరికరాలను ఉపయోగిస్తుండేవాడను. అందుచేత నేను సర్జన్‌గా తయారవటంతో బాటు, నౌకాయాన శాస్త్రంలో మంచి ప్రావీణ్యం సంపాదించాను.

లండన్‌లో చదువు పూర్తి అయినతరువాత మా నాన్న ప్రోత్సాహముతో హాలండ్‌కు వెళ్ళాను. ఆ దేశంలో లేడెన్ విశ్వవిద్యాలయం వైద్య విద్యకు చాలా ప్రసిద్ధిగాంచింది. నేనక్కడ వైద్య విద్యార్థిగా రెండున్నర సంవత్సరాలకాలం గడిపాను.

వైద్య విద్య పూర్తి అయినతరువాత నేను ఇంగ్లాండుకు తిరిగివచ్చాను. అచిరకాలంలో "స్వేలో" అను పేరుగల ఓడపై డాక్టరుగా కుదిరాను. తూర్పు దేశాలకు ఎన్నో దీర్ఘప్రయాణాలు చేసాను. ఈ ప్రయాణాలలో విశేషమయిన అనుభవం సంపాదించాను.

ఈ మధ్యలో నేను కొంత డబ్బుగల బర్టన్ కన్యను వివాహం చేసుకున్నాను. ఆమె మంచి హృదయంగల సుందరాంగి. సుఖమయ వైవాహిక జీవితం గడపాలనే ఉద్దేశ్యంతో, సముద్రప్రయాణాలకు స్వస్తిచెప్పాను. వైద్య వృత్తి నవలంభించి లండన్ మహానగరంలో స్థిరపడ్డాను. మామామగారి వ్యాపారానికి కూడా వారసుడనయ్యాను.

అయితే వైద్య వృత్తి అంత లాభదాయకంగా కనిపించలేదు. వ్యాపారంకూడా క్రమక్రమంగా క్షీణించసాగింది. అటువంటి పరిస్థితులలో ఏం చెయ్యాలి? కర్తవ్యాన్ని గూర్చి నేను, నా భార్య కూలంకషంగా చర్చించుకున్నాం. చివరకు ఒక

నిర్ణయానికి వచ్చాం. ఈ నిర్ణయానుసారం నేను మళ్ళీ ఓడలలో డాక్టరుగా ప్రవేశించాను. బాగా ధనం సంపాదించసాగాను. నేను తిరిగి ఓడలలో పనిచేయటానికి సహృదయంతో అంగీకరించిన నా భార్యను నేను అభినందించక తప్పదు.

ఒకసారి నేను దక్షిణ సముద్రయాత్రకు బయలుదేరిన "ఏంటిలోప్" అనే పేరుగల ఓడలో పనికి కుదిరాను. మా ఓడ బ్రిస్టల్ నగరంనుండి క్రీ.శ. 1699వ సంవత్సరం మే నెలలో ఒక రోజున బయలుదేరింది.



సముద్ర ప్రయాణం చాలా ఆహ్లాదకరంగా వుంది. సముద్రపు గాలి నాకు మంచి శక్తిని ప్రసాదిస్తోంది. సముద్రపు హోరు నాకు ఎక్కడలేని ఉత్సాహాన్ని కలిగిస్తోంది నేను రాత్రిళ్ళు ఆకాశంవంకా, ఆకాశంలోని నక్షత్రాలవంకా చూస్తుండేవాడను. నక్షత్రాలకు సంబంధించిన నిగూఢ రహస్యాలనుగూర్చి ఋర తీవ్రంగా ఆలోచిస్తుండేది. ఆ అపూర్వ అనుభవాన్ని వర్ణించటానికి మాటలు చాలవు. ఎవరి మట్టుకు వారు అనుభవించి ఆనందించవలసిందే.

రోజులు గడిచిపోతున్నాయి. నెలలు గడచిపోతున్నాయి.ఓడ ముందుకు సాగిపోతోంది.

హఠాత్తుగా ఒకరోజున వాతావరణంలో తీవ్రమయిన మార్పు కనిపించ సాగింది. తీవ్రమయిన తుఫాను రాబోతోందని ఓడలోని వాళ్ళందరం భయపడ సాగాం.

భయపడినంతా అయ్యింది. ఒక దుర్ముహూర్తాన ప్రచండమయిన తుఫాను బయలుదేరింది. గాలుల ధాటికి మా ఓడ మునిగిపోతుందేమో అని భయపడ సాగాం. మా కందరకూ సర్వలోక రక్షకుడగు భగవంతుడు జ్ఞప్తికి వచ్చాడు. మే మందరం మా ప్రాణాలను రక్షించే భారాన్ని ఆ భగవంతునిమీదనే పెట్టాం. అయినా మమ్మల్ని భయం వదిలిపెట్టలేదు.

గాలి తన ప్రతాపాన్ని చూపుతూనే వుంది.ఓడ ఏ క్షణాన్న సముద్ర గర్భం పాలవుతుందో తెలియకుండా వుంది. గాలుల ధాటికి ఓడ భూమధ్యరేఖను

దాటి చాలా దక్షిణ ప్రాంతానికి వెళ్ళిపోయింది. మా ఓడ వున్న ప్రదేశం ఏమిటో మాకు స్పష్టంగా తెలియటంలేదు.ఆ ప్రదేశం మా దగ్గరవున్న పటాలలో ఎక్కడా కనిపించలేదు.

ఓడలోని నావికుల పరిస్థితి చాలా అధ్వాన్నంగా వుంది వారు తలకు మించిన భారంతో శ్రమపడవలసివస్తోంది. వారికి సరియైన ఆహారం లభించటం లేదు. ఈ పరిస్థితుల ప్రభావంవల్ల కొందరు నావికులు నీరసించి ప్రాణాలు వది లారు. మిగిలిన వారం అందుకు విచారించటం తప్ప చేయదగింది ఏమీ లేక పోయింది

మిగిలినవారి శరీరాల్లోని శక్తికూడా క్రమక్రమంగా సన్నగిల్లింది. కొండ మరణ దేవత ఎప్పుడు ఎవరిని కౌగిలించుకుంటుందో తెలియకుండా వుంది.

నవంబరు 5వ తేదీ వచ్చింది.మేమున్న దక్షిణ ప్రాంతంలో ఈ రోజు ల్లోనే వేసవికాలం ప్రారంభమవుతుంది. ఆ రోజున మా నావికుల్లో ఒకనికి సముద్ర గర్భాన్ని దాక్కుని పైకి పొడుచుకువచ్చిన కొండ కనిపించింది. అతడా విషయాన్ని మాకందరకూ తెలియజేసాడు. అప్పుడు మాకు కలిగిన భయం ఇంతా అంతా కాదు. ఓడ వెళ్ళి ఆ కొండను ఢీ కొంటే జరిగేదేమిటో ఎవరయినా సులభ ముగా ఊహించగలరు. ఇటువంటి విషయం ఎవరయినా చెబుతుంటే వింటేనే ఒళ్లు జలదరిస్తుంది. మరి ఇటువంటి దృశ్యం నిజంగా ఎదురయితే ?

గాలి ప్రచండంగా వీస్తోంది. అలా వీచటంవల్ల కలిగే దారుణమయిన



ఫలితం ఏమిటో దానికేమాత్రం పట్టినట్లు లేదు. ఓడ కొండను సమీపిస్తోంది... సమీపిస్తోంది...సమీపించింది...వేగంగా వెళ్ళి ఢీ కొట్టింది.

ఓడ రెండు ముక్కలయింది. అది పూర్తిగా సముద్రగర్భంలో మునిగిపోక పూర్వం కొందరు నావికులు సాహసంతో కొండపైకి వెళ్లారు. తరువాత వారి గతి ఏమయిందో నాకు తెలియదు. వారు నీటిపాలయ్యారని ఊహించటమే సమంజసంగా వుంటుంది.

అయితే వేరొక జట్టువారు మాత్రం అపూర్వ ధైర్యసాహసాలు ప్రదర్శించి ఓడకు కట్టుబడియున్న ఒక పడవలో ప్రవేశించి దానిని ఓడనుంచి వేరు చేయ గలిగారు. ఆ అదృష్టవంతుల జట్టులో నేనుకూడా వున్నాను. ఈ విషయం తెలపటానికి నేను ఎంతో సంతోషిస్తున్నాను. ఇది అంతా దైవానుగ్రహం!

పడవలోని ఆరుగురమూ సర్వజన రక్షకుడయిన భగవంతుని నామాన్ని ఉచ్చరించుకుంటూ ముందుకు సాగిపోతున్నాం. ఆ విధంగా సుమారు పదిమైళ్ళు ప్రయాణం చేసాం. కాని అంతలో మరో ప్రమాదం ఎదురయింది. తాడి ప్రమాణమున్న ఒక పెద్ద అల మా పడవమీదకు వచ్చింది. పడవలోని వాళ్ళం నీళ్ళలో పడ్డాం. పడవ నీటిలో మునిగిపోయింది.

నాతోబాటు నీళ్ళలో పడ్డ నా సహచరుల గతి ఏమయిందో నాకు తెలియదు. ఆ అయిదుగురూ సముద్రదేవత ఆగ్రహానికి బలి అయిపోయారని నేను ఊహించవలసి వస్తుంది.

సహచరులనందరినీ పోగొట్టుకున్న నేను ఇంక చేయవలసింది ఏమిటి? భగవంతునిమీద భారంవేసి ముందుకు ఈదుకుపోసాగాను. బొందిలో ప్రాణం వున్నంతవరకు దానిమీద ఆశ తప్పదుకదా? గాలి, సముద్రపు పోటు నాకు ఎంతో సహాయపడసాగాయి. నీటి అడుగు నేల తగులుతుందేమో అని అప్పుడప్పుడు ప్రయత్నించి చూడసాగాను. కాని ఎక్కడా నేల తగలడంలేదు.

క్రమక్రమంగా శరీరంలోని శక్తి సన్నగిల్లసాగింది. అయినా నేను పట్టువిడవకుండా ముందుకు ఈదుకుపోతూనే వున్నాను.కాని ఎంతకాలం ఆవిధంగా చేయగలను? దేనికయినా ఒక మితి అంటూ వుంటుంది. నేను ఆ స్థితినికూడా దాటి పోయే దశకు వచ్చాను. చివరిసారిగా నా అదృష్టాన్ని పరీక్షించుకోవాలనుకున్నాను. నేల తగులుతుందేమో అని ప్రయత్నించి చూసాను.

అవును, నేను అదృష్టవంతుడనే! కాళ్ళకు నీళ్ళలోని నేల తగిలింది! ఆ క్షణాన నాకు వేయి ఏనుగుల బలం వచ్చింది. నేను చేయవలసిన గొప్ప పనులూ ఎన్నో వున్నాయి;అందుచేతనే భగవంతుడు నాకు మాటిమాటికీ తోడ్పడుతున్నాడూ అని అనుకోసాగాను.

మళ్ళీ ఈదటం ప్రారంభించాను. తుఫాను ఉధృతం తగ్గిపోయింది. సముద్రం చాలా ప్రశాంతంగా వుంది. నేను కొంచెంసేపు ఈదుతున్నాను. కొంచెం సేపు నీళ్ళలో నడుస్తున్నాను.నడుస్తున్నప్పుడు నీళ్ళు నా గడ్డందాకా వుంటున్నాయి. అజాగ్రత్తగా వున్నప్పుడు నీళ్ళు నోట్లోకి గూడా వెళ్తున్నాయి...

ఎట్టకేలకు పొడి నేల చేరుకున్నాను.నక్షత్రాలను బట్టి చూడగా అప్పుడు రాత్రి ఎనిమిది గంటలు అయివుంటుంది. సుమారు ఒక అరమైలు దూరం లోపలికి నడిచివెళ్ళాను నాకెక్కడా ఇళ్ళుగాని, మనుష్యులుగాని కనిపించలేదు. బాగుగా అలసిపోయి యున్న నాకు దృష్టి మందగించిందేమో మరి! ఇంక నేను ఏ విషయాన్ని గూర్చి ఆలోచించే స్థితిలో లేను. నీరసంవల్ల నిద్ర ముంచుకువస్తోంది. ఒక

చోట మెత్తని పచ్చిక నేల తగిలింది. వెంటనే అచ్చట మేనువాల్చాను. అనతి కాలములో గాఢంగా నిద్రపట్టింది.

## 2

బాలభానుని కిరణాలు నామీద పడసాగాయి. నాకు మెలకువ వచ్చింది. అప్పటికి నేను సుమారు తొమ్మిదిగంటలసేపు నిద్రపోయి వుంటాను. నేను లేవటానికి ప్రయత్నించానుగాని ఏమాత్రం వీలులేకపోయింది. నేను రాత్రి పడుకునే



టప్పుడు వెల్లకిల పడుకున్నాను.ఇప్పుడు నేను ఆ స్థితినుంచి కదలటానికి ఏమాత్రం వీలులేకపోతోంది.

నా శరీరమంతా భూమికి గట్టిగా కట్టబడి వుంది.నా జుట్టు చాలా ఒత్తుగా పొడవుగా వుంటుంది. ఆ జుట్టుకూడా భూమికి గట్టిగా కట్టబడి వుంది. నన్ను ఎవరో సన్నని, బలిష్టమయిన తాళ్ళతో కట్టివేసినట్లున్నారు. నేను పైకి తప్ప ఇంకో దిక్కుకు చూడటానికి వీలులేకుండా వుంది. పొద్దెక్కుతున్న కొద్దీ సూర్యకాంతి నా కళ్ళను బాధపెట్టసాగింది. నా చుట్టూ ఏదో సందడిగా వుంది. కాని నాకు ఏ విషయమూ అర్థంకావటంలేదు. గట్టిగా నేలకు కట్టివేయబడిన నాకు ఆకాశం తప్ప ఇంకేమీ కనిపించటం లేదుగదా!

అంతలో నా ఎడమకాలిపై ఏదో పాకుతున్నట్లు అనిపించసాగింది. క్రమక్రమంగా ఆ పాకటం నా రొమ్ము భాగంమీదకు వచ్చింది. తరువాత గడ్డం దాకా వచ్చింది. నేను వీలయినంతవరకు కళ్ళను క్రిందకు వంచి చూసాను. ఆశ్చర్యం: నా గడ్డం దగ్గర సుమారు ఆరంగుళాల పొడవున్న మనుష్యుడొకడు నిలబడి వున్నాడు. అతని చేతుల్లో విల్లములు వున్నాయి. ఇంకా అతని దగ్గిర అమ్ముల పొదికూడా వుంది. ఆ పొదినిండా అమ్ములున్నట్లు కనిపించింది.

అతడక్కడ నిలబడే వున్నాడు. మరి నలభైమంది అంగుష్టమాత్రులు నా శరీరంమీద ప్రవేశించారు. వారు నాపై నడుస్తుంటే పాకుతున్నట్లే వుంది, అందరూ వచ్చి న గడ్డం దగ్గరే నిలబడ్డారు. ఆ దృశ్యం ఎంతో ఆశ్చర్యకరంగా

వుంది. నేను వుండబట్టలేక గట్టిగా గర్జించాను. ఆ ధ్వనికి వారు భయపడి వెనక్కు పరుగెత్తసాగారు. ఆ పరుగెత్తటంలో కొందరు నా పక్కలనుంచి జారి క్రింద పడ్డారు. అపుడు వారు తీవ్రంగా గాయపడ్డారని నాకు తెలిసింది.



కొంచెం సేపు గడచిం తర్వాత పారిపోయిన వారందరూ మళ్ళీ వెనక్కు తిరిగి వచ్చారు. వారిలో ఒకడు చాలా ధైర్యవంతునిలా కలదిడ సాగాడు. అతడు నామీద చాలాసార్లు అటూ ఇటూ పచార్లు చేసాడు. అతనికి నా ముఖ దృశ్యం బాగా కనిపించి నట్లుంది. అతడు తన కళ్ళను బాగా విశాలంగా తెరచి, చేతులు

పైకెత్తి, తన భాషలో ఏమో గట్టిగా అరిచాడు. అతని భాష నాకేమీ అర్థం కాలేదు. అతడన్న మాటలనే మిగిలిన వారుకూడా చాలా సార్లు అన్నారు. ఎవరెన్నిసార్లు అన్నా నాకేమీ అర్థం కాలేదు. నాకంతా అయోమయంగా వుంది.

వెల్లకిలా పడుకుని ఉండటం నాకు అసౌకర్యంగానే గాక, బాధాకరముగా గూడా వుంది అంచేత నేను ప్రయత్నించి నా ఎడం చేతికి ఉన్న తాళ్ళను త్రెంపి వేసాను. అక్కడ నేలలో పాతిన మేకులు గూడా వదులై పోయాయి. తరువాత నాకు చాలా బాధాకరంగా ఉన్నప్పటికీ గట్టిగా ప్రయత్నించి నా యెడమ వైపున జుట్టుకు బిగించిన మేకులను గూడా వదులు చేసాను. అపుడు నేను నా తలను రెండంగుళాల మేర కదపటానికి వీలు కలిగింది.

నేను నా యెడం చేత్తో శరీరం మీదవున్న అంగుష్ఠ మాత్రులను పట్టుకోటానికి ప్రయత్నించాను. కాని వారు నా ఉద్దేశ్యం గ్రహించినట్టున్నారు; భయంతో నాకు చిక్కకుండా పారిపోయారు. తరువాత వారు గట్టిగా అరవ సాగారు. ఆ అరుపుల సవ్వడి తగ్గిపోయింతర్వాత వారిలో ఒకడు కీచు గొంతుకతో ఏమో గట్టిగా అన్నాడు.

అతడు ఏమన్నాడో నాకయితే అర్థం కాలేదు కాని మరుక్షణమే సుమారు నూరు అమ్ములు వచ్చి నా ఎడంచేతిమీద పడ్డాయి. తరువాత వారు మరికొన్ని అమ్ములను నా శరీరం మీదకు వదిలారు. అందులో కొన్ని నామీద పడేవుంటాయి.

కాని నేను గట్టి దుస్తులను ధరించి యుండుట వలన నాకేమీ తెలియలేదు. అయితే కొన్ని అమ్ములు మాత్రం నా ముఖంమీద వచ్చి పడ్డాయి.



కొంత సేపటికి అమ్ముల వర్షం ఆగిపోయింది. నేను విచారంతోను, బాధతోను అరిచాను. తాళ్ళను తెంపి వేయడానికి ప్రయత్నింప సాగాను. కాని వెంటనే మళ్ళీ అమ్ముల వర్షం ప్రారంభమైంది. ఈసారి ఆ వర్షం ఇదివరకటి కంటె ఉధృతం అయింది, ఇంకొజట్టువారు వచ్చి నాపైకి ఈటెలు విసర సాగారు. అవి

నా శరీరంలోకి దిగుతాయని వారి వుద్దేశ్యం కాని నేను ధరించిన కోటు, పంట్లాం చాలా గట్టివి, దట్టమైనవి అవటం మూలాన అపని జరగలేదు.

తాళ్ళు తెంపటానికి ప్రయత్నించకుండా వుండటమే మంచిదని అనుకున్నాను. అందువల్ల బాణాల బాధ, ఈటెల బాధ తప్పుతుంది. చీకటి పడే వరకు ప్రశాంతంగా వుండటానికి నిశ్చయించుకున్నాను. చీకటి చాటున నా ఎడమ చేతిని వుపయోగించి స్వేచ్ఛను పొందటానికి ప్రయత్నించ వచ్చుననుకున్నాను. కాని అందులో విజయం సాధించలేక పోయాను. నేను కదలక మెదలక ఉండటంచూచి అంగుష్టమాత్రులు బాణాల వర్ష కురిపించటం మానుకున్నారు. వారింకేదో పని చేయటానికి పూనుకున్నారు.

నా చుట్టూ సవ్వడి అంతకంతకు ఎక్కువ కాసాగింది. దానిని బట్టి నా చుట్టూ చేరుతున్న అంగుష్ఠ మాత్రుల సంఖ్య పెరుగుతోందని ఊహించ సాగాను. నా కుడి చెవికి సుమారు నాలుగు గజాల దూరంలో చాలామంది సుత్తులతోను, ఇతర పరికరాలతోను ఏదో పని చేస్తున్నట్టు ధ్వని వినబడ సాగింది. నేను ఎంతో ప్రయత్నంమీద ఆ వంకకు కొద్దిగా తల త్రిప్పగలిగాను. అక్కడ సుమారు ఒకన్నర అడుగుల ఎత్తుగల కొయ్య పీఠం ఒకటి నిర్మింప బడుతూంది. ఆ నిర్మాణం పూర్తి అయిన తర్వాత దాని మీదకు ఎక్కటానికి రెండు, మూడు నిచ్చెనలను కూడా ఏర్పాటు చేసారు. ఆ పీఠంమీద అంగుష్ఠ మాత్రులు నలుగురు ఒకే సారి నిలబడవచ్చును. ఆ పీఠం అంత విశాలంగా వుంది.

ఆ పీఠంమీదకు నలుగురు అంగుష్ఠ మాత్రులు వచ్చారు. అందులో ఒకడు చాలా ముఖ్యమైన వానిలా కనిపించాడు, అతడు మధ్య వయస్కుడు. మిగిలిన ముగ్గురి కంటె కొంచెం పొడుగ్గా వున్నాడు. పొట్టిగా వున్నవారు ముగ్గురూ అతని సేవకులై వుంటారని నేను భావించాను. వారిలో ఇద్దరు అతనికి ఇరు ప్రక్కలా, మూడోవాడు అతనికి వెనక్కాల నిలబడ్డాడు. వారు అతని పొడపైన దుస్తులను పైకి ఎత్తి పట్టుకున్నారు.

ముఖ్యునిలా కనిపిస్తున్నవాడు నాకు అర్థంకాని భాషలో ఏవో మాటలు మూడుసార్లు అన్నాడు. వెంటనే సుమారు ఏభై మంది అంగుష్టమాత్రులు వచ్చి నా తలకు యెడమ భాగాన కట్టిన తాళ్ళను కోసి వేసారు. అందువలన నేను తలను కుడివైపుకు త్రిప్పి వారిని బాగా చూడటానికి వీలు కలిగింది.

ముఖ్యుడు నన్ను ఉద్దేశించి దీర్ఘోపన్యాసం ఇచ్చాడు. కాని అతని భాషలో ఒక్క మాటకూడా నాకు అర్థం కాలేదు. అయితే అతని హావభావాలనుబట్టి, ముఖకవళికలను బట్టి, చేష్టలను బట్టి కొన్ని విషయాలను అర్థం చేసుకో గలిగాను. అతడు ఒక్కొక్కప్పుడు నన్ను బెదిరించినట్టు కనిపించాడు. ఇంకొకప్పుడు నాపట్ల జాలి, సానుభూతిని ప్రదర్శించినట్లు కనిపించాడు. అతడు ఉపన్యాసం ముగించిం తర్వాత నా భాషలో కొన్ని మాటలు చెప్పాను. నా మాటలు అతనికి ఏమాత్రం అర్థమై వుండావనే భావిస్తున్నాను. నేను వారికి ఏ విధమైన హానినీ తలపెట్టడం లేదని కొన్ని సంజ్ఞల ద్వారా తెలియ జేసాను.

అప్పటికి నేను ఆహారం తీసుకొని చాలా సేపయింది. అందుచేత ఆకలి బాధ నన్ను తీవ్రంగా దహించివేయ సాగింది. అంతకంతకు నీరసం హెచ్చిపో తోంది. ఏక్షణాన్న స్పృహ తప్పుతుందో అని భయపడ సాగాను.

ఇక ఏమాత్రం వుపేక్షించ రాదనీ, నాకు ఆకలి వేస్తున్నట్లు ఆ పొట్టి మనుష్యులకు తెలియ జెయ్యాలనీ నిశ్చయించు కున్నాను. మాటి మాటికీ చేతి వేళ్ళను నోటి దగ్గర పెట్టుకో సాగాను. నా సంజ్ఞలను గమనించిన ముఖ్యుడు నా భావాన్ని గ్రహించి నట్లున్నాడు. ఏమంటే అతడు పీఠం పై నుంచి క్రిందకు దిగి పొట్టి మనుష్యులకు గట్టిగా ఏవో ఆజ్ఞలు జారీ చేయసాగాడు. వెంటనే వారు ఆతని ఆజ్ఞలనుఅమలు చెయ్యటానికి పూనుకున్నారు.

కొందరు మనుష్యులు నాకు రెండు వైపులా నిచ్చెనలు వేసారు. సుమారు వందమంది మనుష్యులు బుట్టలనిండా ఆహార పదార్థాలు తీసుకొచ్చారు. వారు ఆ బుట్టలతో నా పైకి ఎక్కి నోటి వద్దకు చేరుకున్నారు. బుట్టల నిండా రక రకాల ఆహార పదార్థాలున్నాయి, అయితే వారు తెచ్చిన మాంస ఖండాలు, రొట్టెలు మన గోళీకాయల పరిమాణంలో వున్నాయి. నేను వాటిని అవురావురు మంటూ తినివేయ సాగాను. అతి స్వల్ప కాలంలోనే ఆహార పదార్థాలన్నిటికీ సంపూర్ణ న్యాయం చేకూర్చాను. అది చూచి ఆశ్చర్య పోవటం అక్కడనున్న వారందరి వంతు అయింది.

నాకు దాహం వేస్తోందని మరికొన్ని సంజ్ఞలద్వారా తెలియ జేసాను. వెంటనే వారు కొన్ని పీపాలతో ద్రాక్ష సారాయం సరఫరా చేసారు. ఆ పీపాల నన్నిటినీ తృటికాలంలో ఖాళీచేసాను.ఇంకా ద్రాక్ష సారాయం కావాలని సంజ్ఞలతో చెప్పాను. వారు ఆశ్చర్యపోయి ఇంక తమవద్ద ద్రాక్షసారాయం లేదని సంజ్ఞల ద్వారా తెలియజేసారు.

కొందరు పొట్టి మనుష్యులు నా గుండెలపై నాట్యం చేయసాగారు. నేను వారిని పట్టుకొని నేలమీదకు విసరివేయాలని అనుకున్నాను. కాని వారికి ఎటు వంటి హానీ చేయనని ఇంతకుముందు వాగ్దానంచేసి వున్నానుగదా; అంచేత వారికి ఎటువంటి అపకారమూ చెయ్యలేదు.

## 3

కొంతసేపటికి సుమారు పంద్రెండు మంది సేవకులతో కలిసి ఒక ముఖ్య అధికారి నా గడ్డం దగ్గరకు వచ్చాడు. అతడు నాకొక అధికార పత్రం చూపెట్టసాగాడు. నన్ను చక్రవర్తి వద్దకు ఖైదీగా తీసికొనిపోతున్నట్లు సంజ్ఞల ద్వారా తెలియజేయసాగాడు.

నేను మాటలతో అతనికి సమాధానం ఇచ్చాను. కాని నా మాటలు అతనికి అర్థం అయినట్లు లేదు. అంచేత నాకు స్వేచ్ఛను ప్రసాదింపవలసినదని

సంజ్ఞల ద్వారా తెలియజేయసాగాను. అతడు నా కోరికను అర్థంచేసుకున్నాడు. అయితే అతడు నా కోరికను సంజ్ఞలద్వారా నిరాకరించాడు. కాని అతడు నన్ను గౌరవంతో చూడటానికి అంగీకరించాడు నాకు కావలసిన ఆహార పానీయాల నన్నిటినీ సమృద్ధిగా సరఫరా చేయటానికి అంగీకరించాడు. తరువాత అతడు అచ్చటి వారికి కొన్ని ఆజ్ఞలు జారీచేసి వెళ్ళిపోయాడు.



కొందరు పొట్టి మనుష్యులు నాకు ఎడమ వైపుననున్న బిగింపులు కొంచెం సడలించారు. అప్పుడు నేను కుడివైపుకు తిరగటానికి కొంచెం ఆస్కార

ఏర్పడింది. మరికొందరు నా ముఖానికి, చేతులకు ఒక విధమయిన సువాసన లేపనం రాసారు. దాంతో బాణాలు గుచ్చుకోవడంవలన ఏర్పడిన బాధ మటు మాయం అయింది.

నేను త్రాగిన ద్రాక్షసారాయంలో పొట్టి మనుష్యులు ఏదో మత్తుమందు కలిపారు కాబోలు నాకు గాఢంగా నిద్రపట్టింది.

నేను గాఢనిద్రలో మునిగియున్నప్పుడు అక్కడి పనివారు ఒక గొప్ప నిర్మాణం కొనసాగించారు. అది ఒక గొప్ప చక్రాలబండి. దానికి ఇరవై రెండు చక్రాలు మాత్రం వున్నాయి. ఆ బండి ఎత్తు మూడు అంగుళాలు మాత్రమే.నన్ను ఆ బండిపైకి ఎక్కించి, చక్రవర్తి దగ్గరకు తీసుకుపోవాలని వారు అనుకున్నారు.

కాని నన్ను ఆ బండిపైకి ఎక్కించటం అక్కడివారికి ఒక పెద్ద సమస్యగా తయారయింది. ఎట్టకేలకు వారు చాలా కష్టపడి నన్ను ఆ బండిపైకి ఎక్కించగలిగారు. ఆ బండికి నాలుగున్నర అంగుళాల ఎత్తుగల పదిహేను వందల గుర్రాలు పూన్చబడ్డాయి. ఆ బండి నన్ను చక్రవర్తి దగ్గరకు ఖైదీగా తీసుకు పోతోంది. ఇది అంతా నేను గాఢమయిన నిద్రలో మునిగియుండగా జరిగింది.

బండి చక్రవర్తి దగ్గరకు పోతుండగా నాకు హఠాత్తుగా మెలకువ వచ్చింది. నేను నిదురిస్తున్నప్పుడు ఎలా వుంటానో చూడాలని ఇద్దరు ముగ్గురు మనుష్యులు బండిపైకి ఎక్కి నా ముఖంవద్దకు వచ్చారు. అందులో ఒకడు కొంచె

తనా ౯కి తన కత్తి మొనను నా ముక్కులో దూర్చాడు. అందువలన ముక్కులో కదలిక కలిగి పెద్ద తుమ్ము వచ్చింది. ఈ విషయం మూడు వారాల తరువాత ఒక సందర్భంలో నాకు తెలిసింది.

చీకటి పడేవరకు మా బండి ప్రయాణం కొనసాగింది. చీకటి పడిం తర్వాత మేము ఒకచోట ఆగిపోయాం. అప్పుడు నాకు ఒకవైపున అయిదువందల మంది, రెండోవైపున అయిదువందలమంది భటులు నేను తప్పించుకొని పారిపో కుండా కాపలాగా నిలబడ్డారు. వారిలో సగంమంది చేతుల్లో విల్లమ్ములు వున్నాయి. మిగిలిన సగంమంది చేతుల్లో దీపాలున్నాయి.

నేను ఏమాత్రం కదిలి పారిపోవటానికి ప్రయత్నించినా నన్ను చంప టానికి అక్కడివారు సిద్ధంగా వున్నారు. ముందేమి జరుగుతుందో చూద్దామని నేను పారిపోటానికి ప్రయత్నించలేదు.

తెల్లవారింతర్వాత బండి మళ్ళా బయలుదేరింది. బండి నత్తనడక నడుచుకుంటూ మిట్టమధ్యాహ్నం వేళకు చక్రవర్తి నివసిస్తున్న పట్టణ ద్వారం చేరుకుంది. అక్కడ చక్రవర్తి, అతని ముఖ్యోద్యోగులు మున్నగు వారందరూ మాకు ఘనమయిన స్వాగతం ఇచ్చారు.

చక్రవర్తి నా శరీరంపైకి ఎక్కి నన్ను నిశితంగా పరిశీలించాలని అను కున్నాడు. కాని రాజోద్యోగులు అందుకు అంగీకరించలేదు. "ఇది చాలా అపాయ

ముతో కూడిన పని. ఎప్పుడు ఏం జరుగుతుందో తెలియదు. కనుక ఏలినవారు తమ కోరికను ఉపసంహరించుకోటం అందరకూ శ్రేయస్కరం" అని వారు చక్రవర్తితో చెప్పి వుంటారు. చక్రవర్తి విధిలేక అందుకు అంగీకరించి వుంటాడు.

నన్ను పట్టణంలో ఎక్కడ వుంచాలనే విషయం ముఖ్య సమస్య అయింది. మేము ఆగినచోట ఒక పురాతన దేవాలయం వుంది. దానిని ఇప్పుడెవ్వరూ ప్రార్థనలకోసం ఉపయోగించటంలేదు. ఏమంటే అందులో ఒక దుర్మహూర్తాన ఘోరమయిన హత్య ఒకటి జరిగింది.

నన్ను ఆ దేవాలయంలో ఉంచాలని అధికారులు నిశ్చయించారు. నేను మోకాళ్ళమీద ప్రాకి దేవాలయంలో ప్రవేశించాను. రాజోద్యోగులు నేను ఆ దేవాలయంలోంచి తప్పించుకొని పారిపోటానికి వీలులేకుండా తగిన ఏర్పాట్లు చేసారు. ఒక కమ్మరి నన్ను రెండడుగులు పొడవుగల ఏభైతొమ్మిది గొలుసులతో ఒక కిటికీకి కట్టివేసాడు.

నేనున్న దేవాలయానికి ఎదుట అయిదడుగుల ఎత్తున్న ఒక గోపురం ఉంది. చక్రవర్తి ఆ గోపురంమీద నిలబడి దేవాలయంలో ఉన్న నన్ను చూడటానికి బాగా వీలుగా వుంది. నన్ను చూడటానికి చాలామంది వచ్చారనీ, వారు నా శరీరం పైకి ఎక్కి అన్ని అవయవాలను నిశితంగా పరిశీలించారనీ ప్రత్యేకంగా చెప్పవలసిన పని లేదనుకుంటాను.

గొలుసులతో కట్టివేయబడిన నేను ఎక్కడికీ పారిపోలేనని తలంచిన రాజభటులు పూర్వబంధనాలన్నిటినీ తొలగించివేసారు.

నేను దేవాలయాన నిలబడి అటు నిటు తిరుగసాగాను.పొట్టి మనుష్యుల దృష్టిలో నేను ప్రాణంతోవున్న పర్వతంలాగున ఉన్నాను కాబోలు! నన్ను, నా నడకను చూచి అందరూ ఆశ్చర్యపడసాగారు.

# 4

నేను నిలబడి నాచుట్టూ కలయజూశాను. నాకంతా ఆశ్చర్యంగా వుంది. ఆ రాజ్యం ఒక పెద్ద తోటలా కనబడసాగింది. అక్కడ వృక్షాలు చాలా చిన్నవిగా వున్నాయి. బాగా ఎత్తయిన చెట్లు ఏడడుగులున్నాయి, వారి భూములు చిన్న చిన్న పాదులు లాగున ఉన్నాయి. గృహాలు పిచ్చుకగూళ్ళవలె వున్నాయి. ఆహా! భగవంతుడా! ఏమిటీ సృష్టి! ఏమిటీ విచిత్రం! నీ లీలలు ఎటువంటివి! నీ ముందు మేము ఎంతటివారం! అని భగవంతుని లీలలు తలచుకొని అభినందించాను.

చక్రవర్తి నన్ను దగ్గరగా చూడదలచాడు కాబోలు,గోపురము పైనుండి క్రిందకు దిగి గుర్రాన్ని అధిరోహించి నా దగ్గరకు రాసాగాడు. పర్వతంలాగున ఉన్న నన్ను చూచి గుర్రం భయపడింది కాబోలు! అది వెనుక కాళ్లు పైకి ఎత్తి వేసింది. అదృష్టవశాన్న చక్రవర్తి మంచి అశ్వికుడు. అంచేత అతడు క్రింద పడి

పోలేదు. అంతలో అచ్చటకు భటులు పరుగెత్తుకువచ్చి గుర్రాన్ని గట్టిగా పట్టుకున్నారు. చక్రవర్తి జాగ్రత్తగా క్రిందకుదిగడు. పిమ్మట అతడు నన్ను సమీపించాడు.



చక్రవర్తి నా చుట్టూ తిరగ సాగాడు. అతడు నన్ను చూచి చాలా సంతోషించినట్లు కనిపించాడు. "ఇతని కోసం ప్రత్యేకంగా తయారు చేసిన ఆహార పదార్థాలను, పానీయాలను తీసుకురండి" అని అతడు తన భటులను ఆజ్ఞాపించాడు.

వెంటనే రాజ భటులు పోయి రకరకాల భోజన పదార్థాలను, మంచి మంచి పానీయాలను తీసుకువచ్చి నాముందు పెట్టారు. అంతలో చక్రవర్తి గారి భార్య, ఆమె సంతానం కూడా అక్కడకు వచ్చారు. నేను వారందరూ చూస్తుండగానే అతి స్వల్ప కాలంలో ఆహార పదార్థాలన్నిటినీ తిని వేశాను. పానీయాలనన్నిటినీ ఒక చుక్కకూడా మిగల్చకుండా త్రాగివేసాను. ఆ దృశ్యాన్ని చూచి అచ్చటి వారందరూ ఆశ్చర్యంతో నోళ్ళు తెరిచారు. కళ్ళు పెద్దవి చేసుకున్నారు.

చక్రవర్తి తన ప్రజలకంటె పొడవుగా వున్నాడు. అతడు ఏమాత్రం ఆడంబరం, ఆట్టహాసం లేని సామాన్యమైన దుస్తులనే ధరించాడు. కాని శిరస్సు మీద మాత్రం రత్న ఖచితమైన బంగారు కిరీటం వుంది. అతనివద్ద మూడంగుళముల పొడవుగల కత్తి ఉంది. ఆ కత్తి పిడి బంగారంతో చేయబడి వుంది. అందులో రత్నాలు బిగించబడి వున్నాయి. ఆతనికి నేనేమైనా హాని చేస్తానని కాబోలును కత్తినతడు సిద్ధంగా చేతపట్టుకుని వున్నాడు.

చక్రవర్తి ఏమేమో స్పష్టంగానే మాట్లాడసాగాడు. కాని నాకు అర్థం కాలేదు. నా మాటలు అతనికి అర్థం కాలేదు. నేను ఏడు భాషలలో మాట్లాడాను. కాని చక్రవర్తి ఆ భాషల్లో ఒక్కదాన్నీ అర్థం చేసుకోలేక పోయాడు.

రెండు గంటల కాలం గడిచిం తరువాత చక్రవర్తి నావద్ద కొందరు భటులను కాపుంచి తన ఇంటికి వెళ్ళిపోయాడు.

ఆ సమయాన కొందరు పొట్టి మనుష్యులు నా పైకి బాణాలు వేయ సాగారు. ఒక అమ్మువచ్చి నా కంటివద్ద గ్రుచ్చుకుంది. ఇంకొంచెం వుంటే కన్ను పోయేదే! భగవంతుడు నాపక్షాన వున్నాడు!

రక్షక భటులు ఆరుగురు పొట్టి మనుష్యులను పట్టుకొని నాకిచ్చారు. అందులో ఐదుగురిని నా జేబులో వేసుకున్నాను. ఆరవ వానిని నా నోటి దగ్గరకు తీసుకు వెళ్ళాను. నేను తమను నమిలి మ్రింగివేస్తా ననుకున్నాడు కాబోలు, అతడు భయంతో కీచు మన్నాడు. కాని నేను అతనిని మ్రింగివేయలేదు. నేను చాకును బయటకు తీసాను అతనిని ముక్కలు ముక్కలు చేస్తానని అందరూ అపరి మితంగా భయపడ్డారు. అయితే నేను అతనిని ముక్కలు ముక్కలు చేయలేదు. అతని బంధనాలను తెగ్గోసి స్వేచ్ఛను ప్రసాదించాను.

పిమ్మట జేబులోనుండి ఒక్కొక్కనిని బయటకు తీసి కట్లు తెగకోసి స్వేచ్ఛను ప్రసాదించాను. అందరూ ఎంతో సంతోషించారు. నన్ను అపరిమిత ముగా అభినందించారు. నా దయా రసాన్ని వేనోళ్ళ కొనియడారు.

నేను అపాయకరమైన వాడను కాననీ దయార్ద్ర హృదయుడననీ రక్షక భటులు చక్రవర్తికి నివేదించారు. అందు వలన రాజాస్థానంలో నాకు మంచి పేరు ప్రతిష్ఠలు ఏర్పడినాయి.

పదిహేను రోజులు గడిచిపోయాయి. అంతట చక్రవర్తి నాకు తగిన పరు పును ఒకదానిని తయారు చేయవలసిందని తన పని వాండ్రకు ఆదేశించాడు. పని

వాండ్రు రాజాజ్ఞను శిరసావహించి నేను సుఖంగా పడుకోవటానికి తగిన పరు పుమతయారు చేయటానికి పూనుకున్నారు. వారు ఆరువందల చిన్న పరుపులు, దుప్పట్లు మున్నగువానిని తెప్పించి వాటిలో నాకు అనువైన పెద్ద పరుపును కుట్టారు. ఈపని పూర్తి చేయటానికి వారికి పదిహేను రోజులు పట్టింది, ఆ పరుపు మీద నేను సుఖంగా నిద్రింపసాగాను.

నా సంగతి ఆ దేశంలోని వారందరికీ తెలిసింది. నన్ను చూడటానికి దూర ప్రదేశాలనుంచి కూడా జనులు గుంపులు గుంపులుగా రాసాగారు. వారి కందరికీ తగిన సౌకర్యాలు కలుగజెయ్యడానికి చక్రవర్తికి కష్టంగా వుంది. అందువల్ల నన్నొక్కసారి చూచిన వారందరూ తమ తమ గ్రామాలకు తిరిగి పోవాలనీ, పట్ట ణంలో రోజుల తరబడి వుండటానికి వీలు లేదనీ చక్రవర్తి ఆజ్ఞాపించాడు.

అంతట పలువురు పెద్దలు సమావేశమై నన్ను ఏమి చెయ్యాలనే విషయం గూర్చి దీర్ఘంగా చర్చలు కొనసాగించారు. నేను చాలా అపాయ కరమైన వాడి ననీ, ఎప్పటికయినా వారికి హాని చేస్తాననీ కొందరు భయం వెలిబుచ్చారు. నేను ఇంకా కొంతకాలం బతికివుంటే దేశంలో ఘోరమైన కఱవు రావటం తథ్యమని మరి కొందరు తమ తీవ్రమైన ఆందోళనను ప్రకటించారు.

అన్నం పెట్టకుండా మాడ్చి గాని, విషపూరితాలయిన బాణాలను ఉపయో గించి గాని నన్ను చంపివేస్తే అందరి పీడా విరగడవుతుందని ఇంకా కొందరు

అన్నారు. నన్ను ప్రాణాలతో వుండనివ్వ వలసిందనీ, ప్రజలకు వినోదం కలుగు తుందనీ నా తరపున చాలామంది గట్టిగా వాదించారు.

ఈ చర్చలు సుమారు రెండురోజులు జరిగాయి. ఎట్టకేలకు వారు నన్ను చంపకుండా వుండటానికే నిశ్చయించుకున్నారు. నా అదృష్టానికి నేను ఎంతో సంతోషించాను. నన్ను సృష్టించి పోషిస్తున్న సకల లోక రక్షకుడైన భగవానుని వేనోళ్ళ కొనియాడాను.

చక్రవర్తిగారి అపారమయిన దయవల్ల నాకు కావలసిన సకల సౌక ర్యాలూ సమకూర్చ బడుతున్నాయి. ప్రతిరోజూ నాకు గొర్రెలు, ఎద్దులు మున్నగు జంతువులు, రొట్టెలు పంపబడుతున్నాయి. వాటికి తోడు రక రకాల ద్రాక్ష పానీ యం కూడా సప్లయి చేయబడుతోంది. ఈ ఆహార పదార్థాలు, పానీయాలు నాకు ఎంతో సంతృప్తిని కలిగిస్తున్నాయి.

నేను చెప్పిన పనులు చేయటానికి ఎల్లప్పుడూ కొన్ని వందలమంది సేవకులు సంసిద్ధంగా ఉండేవారు. కొన్ని వందలమంది దర్జీవాండ్రు నాకు కావలసిన రక రకాల దుస్తులను కుట్టసాగారు.

నాకా దేశపు భాషను చక్కగా నేర్పటానికి ఆరుగురు పండితోత్తములు నియమింప బడినారు. ఆ భాష చాలా సులభంగా వుంది. అందుచేత కొన్నిరోజులు గడచే సరికే నేను ఆ భాషను చాలా వరకు నేర్చుకొన గలిగాను.

చక్రవర్తి చాలాసార్లు నా వద్దకు వచ్చి మాట్లాడసాగాడు నాకు స్వేచ్ఛను ప్రసాదించ వలసినదని నేను అతనిని మాటి మాటికి బతిమాలుకో సాగాను. కాని లాభం లేకపోయింది. నాకు స్వేచ్ఛను ప్రసాదించటానికి అతడు ప్రతిసారి నిరాకరించేవాడు.

ఒకనాడు నా జేబులలో ఏమేమి వస్తువు లున్నాయో వెదకటానికి ఇద్దరు రాజోద్యోగులు వచ్చారు. వారివద్ద కలములు, సిరా కాగితాలు మొదలైనవన్నీ సిద్ధముగా ఉన్నాయి. నేను ఆ ఉద్యోగుల నిద్దరినీ ఒక్కొక్కసారి ఒక్కొక్క జేబులో పడవేసాను.

వారు నా ముక్కుపొడుం పెట్టెను చూచి ఇలా వ్రాసుకున్నారు. "ఎడంవైపు జేబులో వెండితో చేయబడిన ఒక పెద్ద పెట్టెవుంది. దానిని పీల్చగా చాలాసేపటి వరకు తుమ్ములు వచ్చాయి."

నాచేతి రుమాలును చూచి రాజోద్యోగులు ఇలా వ్రాసుకున్నారు: "కుడివైపు జేబులో ఒక మంచపాటి చతురస్రపు గుడ్డవుంది. అది రాజ భవనంలోని తివాసీని పోలివుంది."

నా జేబులో వున్న ఒక చిన్న తెల్లకాగితాల పుస్తకాన్ని చూచి వారు ఇలా వ్రాసుకున్నారు : "తెల్లని వస్తువుతో చేయబడిన పొరలకట్ట ఒకటి ఉంది. అది తాళ్ళతో కట్టబడియుంది. అందు పెద్ద పెద్ద అంకెలు, అక్షరాలు వున్నాయి".

నా దువ్వెనను చూచి వారు ఇలా వ్రాసుకున్నారు : "ఒక జేబులో పెద్ద యంత్రం ఒకటి వుంది. దానికి పట్టాలలాంటి కమ్ములు వున్నాయి."

నా పిస్తోలును చూచి వారిలా వ్రాసుకున్నారు : "ఒక జేబులో బోలుగా నున్న ఇనుప స్తంభం ఒకటి వుంది. దాని పేరు పిస్తోలట. దానిని ఉపయోగించడం ఎలాగో మాకు తెలియదు. తెలుసుకోటానికి ప్రయత్నించాం కాని సాధ్యపడ లేదు."

నావద్దనున్న నాణెములను చూచి వారు ఇలా వ్రాసుకున్నారు: "ఒక జేబులో తెల్లని లోహంతో చేయబడిన గుండ్రని ముక్కలు కొన్ని కనిపించాయి. అవి మేము మోయలేనంత బరువుగా వున్నాయి"

నాదగ్గరనున్న గడియారాన్ని చూచి వారిలా వ్రాసుకున్నారు : "ఒక జేబులోనుండి పొడవయిన గొలుసు ఒకటి వ్రేలాడుతోంది. ఆ గొలుసు చివర అత్యద్భుతమయిన యంత్రం ఒకటి ఉంది. ఆ యంత్రాన్ని చెవులవద్ద పెట్టుకోగా నీటి యంత్రం వలె సవ్వడి వినిపించింది. అది ఏదో మనకు తెలియని వింత జంతు వని గాఢంగా విశ్వసిస్తున్నాము"

ఇంకా నాదగ్గరనున్న కత్తి, గడ్డం గీసుకునే రేజరు మున్నగు వస్తువు లను గూర్చిగూడా వారు వ్రాసుకున్నారు. వారు అన్ని వస్తువులను గూర్చి ఒక నివేదికను తయారుచేసి చక్రవర్తికి సమర్పించారు.

తరువాత చక్రవర్తి నా దగ్గరకు వచ్చి,వస్తువులనన్నిటినీ తనకు స్వాధీనం చేయవలసిందిగా ఆజ్ఞాపించాడు. అయితే అతడా ఆజ్ఞను చాలా సరళమయిన భాషలోనే జారీచేశాడు. తన ఆజ్ఞను మన్నించకపోతే నన్ను చంపివేయటానికి విల్లమ్ములు పూనిన మూడువేలమంది సైనికులనుగూడా చక్రవర్తి సిద్ధంచేశాడు.అయితే అప్పుడు నాకా విషయం తెలియదు; తరువాత మాత్రమే నాకు తెలిసింది. దానికి కారణం నా దృష్టి పూర్తిగా చక్రవర్తిమీద ఉండటం మాత్రమే.

నేను మొదట ఒరతోబాటు కత్తిని చక్రవర్తికి సమర్పించాను. అతని కోరికపై కత్తిని ఒరలోనుండి బయటికి తీసి అటు నిటు త్రిప్పాను. సూర్యకాంతి దానిపైబడి తళ తళ మెరయసాగింది. దానిని చూచి అచ్చటివారందరూ ఆశ్చర్యపోయారు; అపరిమితంగా భయపడ్డారుగూడా.

అది చూచి చక్రవర్తి ఇలా అన్నాడు : "ఇంక చాలును!ఇంక చాలును! దానిని నేలమీద పడవెయ్" నేను ఎంతో వినయంగా చక్రవర్తి కోరికను మన్నించాను.

తరువాత చక్రవర్తి ఇలా అన్నాడు: "నీదగ్గరనున్న పిస్తోలు ఎలా పని చేస్తుందో చూడాలని వుంది. మా కోరికను మన్నించు"

"నేను మీరు కోరినప్రకారం చేయటానికి నాకు ఎటువంటి అభ్యంతరం లేదు, మహాప్రభూ! మీ కోరికను తప్పకుండా మన్నిస్తాను. కాని మీరిప్పుడు ఏ

మాత్రం భయపడకూడదు" అని చక్రవర్తిని సౌమ్యంగా హెచ్చరించాను. పిమ్మట పిస్తోలు పేల్చాను.

అప్పుడు గొప్ప మోతవినబడింది. ఆ ధ్వనికి చాలామంది జనులు అపరిమితంగా భయపడిపోయి ప్రాణాలు పోయినవారిలాగున నేలమీద పడిపోయారు.

చక్రవర్తి ప్రజలందరికంటే చాలా ధైర్యవంతుడు. అందువలన అతడు తక్కినవారివలె భయపడలేదు. ఎప్పటిలాగున నిలబడియున్నాడు. నేను అతని ధైర్యాన్ని పరిపరి విధాల ప్రశంసించాను.

పిస్తోలు మోతను విన్నతరువాత చక్రవర్తి నాతో ఇలా అన్నాడు : "గడియారాన్ని కూడా చూడవలెననివుంది. దానిని నాదగ్గర అట్టేపెట్టుకుంటాను"

చక్రవర్తి సైనికులలో చాలా పొడవుగానున్న ఇద్దరు నా గడియారాన్ని రాజభవనానికి తీసుకుపోయారు. అచ్చట దానిని ఒక దూలానికి వ్రేలాడగట్టారు. దాని చప్పుడు విని చక్రవర్తి ఎంతో ఆనందించాడు.

చక్రవర్తికి నావద్దనున్న అన్ని వస్తువులను చూపి, వాటినిగూర్చి వివరించి చెప్పాను. చక్రవర్తి ఎంతో సంతోషించి నన్ను పరిపరివిధాల అభినందించాడు.

"సరే. గడియారం రాజభవనం చేరుకుంది. ఇక మిగిలిన వస్తువులలో కత్తిని, పిస్తోలనుమాత్రం మా స్వాధీనం చెయ్యి. తక్కిన వస్తువులను నీవద్దనే

అట్టిపెట్టుకో. అందుకు మాకు ఎటువంటి అభ్యంతరమూ లేదు. నీ వినయాన్ని, క్రమశిక్షణను నేను ఎంతో ప్రశంసిస్తున్నాను" అని చక్రవర్తి ఎంతో ప్రశంసిస్తున్నాను" అని చక్రవర్తి ఎంతో ఉత్సాహంగా మాట్లాడాడు.

కత్తిని, పిస్తోలును చక్రవర్తి సైనికులకు స్వాధీనం చేశాను. వారు ఆ రెండు వస్తువులను చక్రవర్తికి చెందిన సామాను కొట్లకు చేర్చారు. మిగిలిన వస్తువులు నా దగ్గరనే ఉండిపోయాయి.

## 5

నా మంచి ప్రవర్తనను జనులందరూ మెచ్చుకోసాగారు. కొందరు నా దగ్గరకు వచ్చి నాతో ఆటలాడుకోసాగారు. చక్రవర్తికూడా నాకానందాన్ని చేకూర్చటానికి తన ఆస్థానంలోని వారిచే రకరకాల వినోద నైపుణ్య ప్రదర్శనలు చేయించసాగాడు. ఒక్కొక్కప్పుడు అందులో పెద్ద పెద్ద ఉద్యోగులుకూడా పాల్గొనేవారు. వారికి అప్పుడప్పుడు గాయాలుకూడా తగులుతుండేవి.

నేనుకూడా చక్రవర్తికి సంతోషం కలిగించటానికి పరిపరివిధాల ప్రయత్నించసాగాను.

ఒకనాడు కొందరు పనివాండ్రచేత కొన్ని కర్రలను తెప్పించాను. తొమ్మిది కర్రలను నేలమీద పాతి, ఆ కర్రలమీద నా చేతి రుమాలును గట్టిగా

బిగించాను. అప్పుడది ఒక చదునయిన పీఠంలాగున ఉంది. నేను కొంతమంది అశ్వికులను పిలిచి వారిని, వారి గుర్రములను చేతిరుమాలు పైకి ఎక్కించాను. అచ్చట వారు అటు ఇటు తిరుగుతూ పోరాడుచున్నట్లు నటింపసాగారు. ఆ ఆట



చూసి చక్రవర్తి అపరిమితమయిన ఆనందం పొందాడు. నేను అవిధంగా అనేక సార్లు చేశాను.

ఒకనాడు నేను చక్రవర్తినే చేతిరుమాలు పైకి ఎక్కించాను. అప్పుడతడు ఎంతో సంతోషించాడు. పైనుండి సగర్వంగా ఆజ్ఞలు జారీచేయసాగాడు. చక్రవర్తి

కోరికపై అతని భార్య (చక్రవర్తిని) దగ్గరకు వచ్చి భర్తను చూసింది. తన భర్త గొప్పతనాన్ని స్వయంగా చూసి ఎంతగానో మురిసిపోయింది.

ఒకసారి చేరుమాలు చిల్లుపడింది. అప్పుడొక గుర్రం అశ్వికునితోబాటు చిల్లులోనుంచి క్రిందపడింది. నేనప్పుడు అశ్వికునకు తగిన సహాయంచేసి ఓదార్చాను అంతటితో ఆ ఆటకు స్వస్తివాక్యం పలికాను.



ఒకనాడు నేను నా కాళ్ళను అటు ఇటు బాగగా చాపి నిలబడ్డాను

అప్పుడు చక్రవర్తి ఆజ్ఞ ననుసరించి మూడువేలమంది సైనికులు, అంతేమంది అశ్వికులు వాద్యాలు మ్రోగుతుండగా నా కాళ్ళ సందునుంచి వెళ్ళారు. వారు జెండాలు ఎగురవేస్తూ వెళ్ళారు. ఆ మనోహర దృశ్యం చూసి చక్రవర్తి, అతని ఉద్యోగులు ఎన్నో విధాల ఆనందం పొందారు. నన్ను పరిపరివిధాల ప్రశంసించారు.

నాకు స్వేచ్ఛను ప్రసాదించవలసిందని చక్రవర్తిని అప్పుడప్పుడు అడుగుతునే ఉన్నాను. ఎట్టకేలకతడు ఈ క్రింద పేర్కొన్న షరతులపై నాకు స్వేచ్ఛను ప్రసాదించటానికి దయతో అంగీకరించాడు.

"పర్వత మనుష్యుడు ఏ పరిస్థితులలోను, ఎటువంటి పరిస్థితులలోను దీవిని వదిలిపెట్టి వెళ్ళటానికి ప్రయత్నించకూడదు. చక్రవర్తి అనుమతి లేకుండా అతడు ముఖ్యపట్టణంలో ప్రవేశింపకూడదు. అతని రాకను తెలియజేయటానికి రెండు గంటలు ముందుగా ప్రజలకు హెచ్చరిక చేయబడుతుంది. అతడు పెద్ద పెద్ద బాటల మీద నడవాలే గాని, మైదానాలలోను, పంట పొలాలలోను ప్రవేశింపరాదు. బాటల పైన నడచునపుడు గుర్రములనుగాని, బాటసారులను గాని తొక్కివేయ కూడదు. పట్టుకోకూడదు. చాల తొందరగా వార్తలను పంపవలసి వచ్చినపు డాతడు వార్తలను తీసుకుపోయే వానిని మోస్తూ వుండాలి. బ్లెఫుస్కు దీవిలోనున్న శత్రువులను సర్వనాశనం చేయటానికి తగిన విధంగా తోడ్పడాలి. వారు ప్రస్తుతం తయారు చేస్తున్న నౌకాదళాన్ని నాశనం" చేయాలి.

నేను చక్రవర్తి విధించిన షరతులకు అంగీకరించి ఒక అధికార పత్రం

మీద సంతకం పెట్టాను. చక్రవర్తి వెంటనే నాకు స్వేచ్ఛ ప్రసాదించాడు. "భగవంతుడా! భగవంతుడా! భగవంతుడా! నీవు దయాపరుడవు. నేను నీకు కృతజ్ఞుడను! ఇకముందు నన్ను రక్షించే భారంకూడా నీదే!" అని మనస్సులోనే అనుకొని ఆనందించాను.

## 6

ముఖ్యపట్టణం పేరు మిల్డెండో. దాన్ని చూడటానికి అనుమతిని ప్రసాదించవలసిందిగా చక్రవర్తిని కోరాను. దానికి అతడు వెంటనే అంగీకారం తెలిపాడు. ఎవ్వరికీ హాని చెయ్యకుండా జాగ్రత్తగా వుండవలసిందని మాత్రం కోరాడు.

పట్టణం చుట్టూవున్న గోడ ఎత్తు రెండున్నర అడుగులు మాత్రమే. నేను పట్టణంలో ప్రవేశించి ముఖ్యమైన వీధులలో అపరిమితమైన జాగ్రత్తతో తిరిగాను. నా వలన ఎటువంటి అపాయం కలుగకుండా ఉండటం కోసం ప్రజలు ఇళ్లలోనే వుండి కిటికీల గుండా నన్ను చూడసాగారు.

రాజభవనాలు పట్టణం మధ్య వున్నాయి అక్కడే రెండు పెద్ద వీధులూ కలుస్తున్నాయి. భవనాల చుట్టూ రెండడుగుల ఎత్తుగల గోడ వుంది. చక్రవర్తి అనుమతితో నేను గోడదాటి దొడ్డిలో ప్రవేశించాను. భవనాలు ఐదడుగుల ఎత్తు

న్నాయి. భవనంలోని గదులను చూడవలసిందని చక్రవర్తి నన్ను ఆహ్వానించాడు. కాని భవనాలకు అపాయం కలుగకుండా గదులు చూడటం కష్టమని భావించాను. మూడురోజులు కష్టపడి మూడడుగుల ఎత్తున్న రెండు పీటలు తయారు చేసాను. రెండు పీటలను వేర్వేరు చోట్లనుంచి, వాటిపై కాళ్ళు పెడుతూ భవనాలు దాట సాగాను. భవనాల కిటికీలు తెరచి యుంచబడ్డాయి కిటికీలలోనుంచి లోని గదులను చూసాను. ఒక గదిలో రాణి ఆమె పిల్లలు వున్నారు. రాణి తన చేతిని బయటకు చాపింది. నేను దానిని మృదువుగా ముద్దు పెట్టుకున్నాను.

ఒకనాటి ఉదయాన్న ప్రధాన కార్యదర్శి అను రెల్‌డ్రెసాల్ వచ్చి నన్ను కలుసుకున్నాడు. అతనితో ఒక గంటసేపు మాట్లాడటానికి నేను మర్యాద పూర్వకంగా అంగీకరించాను. నేను నేలమీద పడుకుంటాననీ, అతడు నా చెవివద్ద నిలబడి మాట్లాడవచ్చుననీ చెప్పాను, కాని అతడందుకు అంగీకరించలేదు. అతని కోరికపై అతనిని నా అరచేతిలో నిలబెట్టుకున్నాను.

అప్పుడతడు ఇలా చెప్పసాగాడు. "ఈ దేశంలోని ప్రజలు రెండు ప్రధాన పక్షాలుగా చీలిపోయి ఉన్నారు. దేశం అంతః కలహాలలో మునిగివుంది. ఒక స్వల్ప కారణానికి ఈ దీవిలోని ప్రజలకు, బ్లెఫుస్క్యూదీవిలోని ప్రజలకు యుద్ధం ప్రారంభమైంది. ఆ తగవులు ఇంతవరకూ చల్లారలేదు. ఆ దీవిలోని ప్రజలు ఒక గొప్ప నౌకాదళం తయారుచేసి ఈ దీవిమీదకు దండెత్తటానికి సిద్ధంగా వున్నారు. వారు విజయం సాధిస్తారని మా చక్రవర్తి ఎంతో భయపడుతున్నాడు. గాని ఆయ

నకు మీ ధైర్య సాహసాలమీద శక్తి సామర్థ్యాలమీద మిక్కుటమైన నమ్మకం వుంది.

అందుచేత మీరీయుద్ధంలో మాకు సర్వ విధాలా తోడ్పడాలని చక్రవర్తి గాఢంగా వాంఛిస్తున్నాడు. అన్ని విషయాలను మీకు తెలియ జేయవలసిందిగా ఆయన నాకు ఆజ్ఞ జారీచేసాడు. నేను ఆయన చెప్పినవిధంగాచేసి నా బాధ్యతను నిర్వర్తించాను. మీరు మాకు తప్పక సహాయం చేస్తారనిఆశిస్తున్నాను."

అప్పుడు నేను అతనితో ఇలా అన్నాను. "మిత్రమా! మీరు నా కృతజ్ఞతను దయచేసి మీ చక్రవర్తికి తెలియజేయండి. మీ చక్రవర్తి నా సహాయం కోరినందుకు నేను హర్షం ప్రకటిస్తున్నాను నేను ఆయన ఆజ్ఞలను శిరసావహించటానికి ఎల్లప్పుడూ సంసిద్ధంగా ఉన్నాను కాని నేను మీ దీవికి చెందిన వాడనుకాను. విదేశీయుడను, అందువలన నేను మీదేశంలో వున్న కక్షల వ్యవహారంలో జోక్యం కలుగజేసుకోటం ఏమాత్రం ఉచితంగా వుండదని గట్టిగా విశ్వసిస్తున్నాను. అయితే విదేశీయుల బారినుండి మీదేశాన్ని, మీ చక్రవర్తిని సంరక్షించటానికి నేను కంకణం కట్టుకుని కూర్చుంటాను. ఎప్పుడూ సిద్ధంగా వుంటాను. అలా చేయటంలో నేను నా ప్రాణాలను సహితం లెక్కించను. ఈ విషయాల నన్నింటినీ దయయుంచి మీరు మీ చక్రవర్తికి తెలియజేయండి."

# 7

యుద్ధం చేయకుండానే బ్లెఫుస్కూ దీవిలోని వారిని, చక్రవర్తికి వశం చేయటం ఎలాగా అని ఆలోచింప సాగాను. నేను సముద్ర తీరానికి వెళ్ళి నాదగ్గర నున్న దూరదర్శిని సహాయంతో బ్లెఫుస్కూ దీవిని పరిశీలించాను.

ఒక రేవువద్ద ఏభై యుద్ధనౌకలు, మరికొన్ని ఓడలు నేనున్న దేశం (లిల్లి పుట్ దేశం) పైకి దండెత్తటానికి సిద్ధంగా వున్నాయి. నేను దారాలవలె వున్న కొన్ని త్రాళ్ళను, సూదులవలె వున్న కొన్ని ఇనుప కడ్డీలను పోగు చేసాను. కడ్డీ లను వొకవైపున వంచి త్రాళ్ళను కట్టాను.

నేను నాకోటు, చెప్పులు, మేజోళ్ళు తీసేసి సముద్రంలో దిగి శత్రువుల దీవి దగ్గరకు ప్రయాణం ప్రారంభించాను. మొటట సముద్రం అంత లోతుగా లేదు కాని పోయిన కొలది లోతు ఎక్కువ కాసాగింది. లోతు ఎక్కువగా నున్న ప్రదేశాన ఈదసాగాను. లోతు తక్కువగా నున్న చోట నడవసాగాను. ఎట్టకేలకు శత్రువుల ఓడలను చేరుకున్నాను.

నా ఆకారాన్ని చూచి శత్రువుల ఓడలలోని నావికులు అపరిమితంగా భయ పడ్డారనటంలో సందేహం ఏమీలేదు. వారు ఓడలలోనుంచి నీటిలోనికి దుముకి ఈదుకుంటూ పోయి తీరాన్ని చేరుకున్నారు. నేను ఒక్కొక్క ఓడకు ఒక త్రాడు

కట్టి ఆ త్రాళ్ళ నన్నిటిని కలిపి ముడివేశాను. నేనలా చేస్తుండగా తీరానికి వెళ్ళిన వారు నామీద వేలకొలది బాణాలను విసర సాగారు. అవి నాకు ఎనలేని బాధను కలుగజేశాయి. అంతేకాదు, నేను కళ్ళజోడు ధరించాను గనుక సరిపోయింది గాని, లేకపోతే బాణాలు గుచ్చుకొని నారెండు కళ్ళూ నిరుపయోగమైపోయి ఉండేవి.

ఏభై ఓడల లంగరులను తీసివేశాను. వాటికి కట్టిన త్రాళ్ళను ఒకచోటముడి వేసానని చెప్పాను గదా. ఆ ముడి పట్టుకుని, ఓడలనన్నిటినీ ఈడ్చుకుంటూ లిల్లీపుట్ దేశం వైపుకు ప్రయాణం సాగించాను. ఇది అంతా తిలకిస్తూ ఉన్న బ్లెఫుస్కూ ద్వీపవాసులు కలగుండు పడి గోలు గోలున ఏడుస్తూ కేకలు పెట్ట సాగారు. నేను మాత్రం అతివేగంగా ప్రయాణం సాగించాను. కొంతదూరం పోయినతరువాత ఆగి నా శరీరంపై గుచ్చుకొని యున్న అమ్ములనన్నిటినీ తీసి పారవేశాను. తరువాత ప్రయాణం శరవేగంతో సాగించాను.

నారాకకోసం ఎదురుచూస్తూ చక్రవర్తి, ముఖ్యమైన రాజోద్యోగులు, అనేకమంది జనులు తీరాన నిలబడి వున్నారు. నేను ఈడ్చుకొని వస్తూవున్న ఏభై ఓడలు వారికంటబడ్డాయి. నేను మెడవరకు సముద్రంలో మునిగివుండటంచేత వారికి కనిపించలేదు. అందువలన శత్రువులు నౌకలతో దండెత్తి వస్తున్నారని వారు తీవ్రంగా ఆందోళన పడసాగారు. కాని నేను త్వరగా వారిని సమీపించి, "జయము జయము! చక్రవర్తికి జయము!! మనకందరకు దిగ్విజయము!!!" అని గట్టిగా అరిచాను.

చక్రవర్తి మున్నగు వారందరూ నా గొంతును గుర్తుపట్టారు. నా మాటలు విని అందరూ సంతోషించారు. వారి భయం పటాపంచలై పోయింది. అందరూ సంతోషం పట్టలేక అరిచారు. హర్ష ధ్వానాలు చేశారు.

విజయోత్సాహంతో నేను లిల్లిపుట్ దేశంలో ప్రవేశించాను చక్రవర్తి నా ప్రజ్ఞావిశేషాలను పరి పరి విధాల ప్రశంసించాడు. అంతటితో సంతృప్తి చెందక నాకొక గొప్ప బిరుదాన్ని ప్రసాదించాడు కూడా. నేను చక్రవర్తికి నా కృతజ్ఞతను తెలిపాను.

ఆ సందర్భాన చక్రవర్తి ఇలా అన్నాడు. "నీవు శత్రువుల యుద్ధ నౌకలను కట్టగట్టి తీసుకు వచ్చినందుకు ఎంతో సంతోషిస్తున్నాను. వారి దగ్గర ఇంకా కొన్ని ఓడలు మిగిలి వున్నాయి. వాటిని కూడా తీసుకు రావలసిందిగా కోరుతున్నాను."

అపుడు నేను ఇలా అన్నాను: "మహాప్రభూ! నేను మీ శత్రువులను తగిన విధంగా శిక్షించాను. ఇంకా వారిని చంపాలనుకోటం చాలా అన్యాయం."

నా సమాధానం చక్రవర్తికి ఏమాత్రం రుచించలేదు. ఆ సమాధానం ఇచ్చినందుకు అతడు నన్నెప్పుడూ క్షమించలేదు. రాజాస్థానంలో ఉన్న కొందరు ప్రముఖులు నాకు పరమ విరోధులయ్యారు. వారు నాకు హాని చెయ్యటానికి కుట్రకూడా పన్నసాగారు.

మూడు వారాలు గడచిపోయాయి. అంతట బ్లెఫుస్కూ దీవినుండి ఆరుగురు ముఖ్యులు అయిదువందలమంది సేవకులతో లిల్లిపుట్ దేశానికి రాయబారం కోసం వచ్చారు. చక్రవర్తి నా కోరికపై వారితో సంధికంగీకరించాడు.

ఆరుగురు ప్రముఖులు నన్ను కూడా కలుసుకుని నా శౌర్య సాహసాలను, పరాక్రమాన్ని శత సహస్ర విధాల ప్రశంసించారు. నన్నొకసారి తమ దీవికి తప్పకుండా రావలసిందిగా ఆహ్వానించారు. వీలుచూసుకుని తప్పక వస్తానని వాగ్దానం చేశాను. వారు సంతోషించి తమ దీవికి తిరిగిపోయారు.

# 8

ఒకనాడు సాయంకాలం నావద్ద కొక లిల్లిపుట్ ప్రముఖుడు వచ్చాడు. నాతో కొన్ని విషయాలు అత్యంత రహస్యంగా మాట్లాడాలని చెప్పాడు. అప్పుడు నేనతన్ని బండితోకూడ జేబులో పెట్టుకొని లోపలకు తీసుకుపోయాను. తలుపులు మూసివేసి లోపల నా గదిలో టేబులువద్ద కూర్చున్నాను. జేబులో వున్న ప్రముఖుని బండితోగూడ టేబులుమీద పెట్టాను.

ప్రముఖుని ముఖంలో తీవ్రమైన ఆందోళన స్పష్టంగా కనిపిస్తూ వుంది. నేను అతనితో ఇలా అన్నాను: "మీ ముఖం చూడగా మీరు ఏదో చాలా ముఖ్యమైన విషయాన్ని గూర్చి మాట్లాడదలచుకున్నారని స్పష్టంగా తెలుస్తున్నది. దయయుంచి అది ఏమిటో చెప్పవలసిందిగా కోరుతున్నాను."

అప్పుడు ఆ ప్రముఖుడు ఇలా అన్నాడు: "మీరు ఊహించింది సరియైనదే అంటంలో సందేహం ఏమాత్రము లేదు. మీ తెలివి తేటలను నేను అభినందిస్తున్నాను. రాజాస్థానంలో మీకు చాలామంది విరోధులు ఏర్పడ్డారు. ఈ విషయం గూర్చి మిమ్మల్ని తీవ్రంగా హెచ్చరించటానికే నేనిప్పుడు వచ్చాను.

ఇటీవల ఒక వార్తా పత్రికలో మీరు రాజద్రోహులని పెద్ద అక్షరాలతో వ్రాయబడింది. మీరు బ్లెఫుస్కూ దీవిని పూర్తిగా జయించటానికి నిరాకరించారట. వారిని పూర్తిగా నాశనం చెయ్యాలని మావాళ్ళ ఉద్దేశ్యం. ఆ దీవిలోనివారి ఆహ్వానాన్ని మీరు అంగీకరించారట. ఇది మా వాళ్ళకు ఏమాత్రం ఇష్టం లేదు.

అంతేకాదు. మీ శక్తి సామర్థ్యాలను చూసి మా దీవిలోని వారు కొందరు అసూయపడుతున్నారు. అట్టి వారిలో ముఖ్యుడు, అసమర్థ శిఖామణి ఫ్లిమ్నాప్. మీరు రాత్రి గాఢంగా నిదురిస్తున్నప్పుడు మీ ఇంటికి నిప్పు అంటించి మిమ్మల్ని చంపివేయాలని అతడు గట్టిగా వాదిస్తున్నాడు. ఇంకా మీ దుస్తులను, బట్టలను విషపూరితం చెయ్యాలని కూడా అంటున్నాడు.

కాని రాజాస్థానంలో మీకొక ముఖ్యమైన స్నేహితుడున్నాడు. అతడే రెల్ డ్రెసాల్. అతడు మిమ్మును శతవిధాల సమర్థిస్తూ మాట్లాడాడు. మీయందు అణుమాత్రమైనా దోషం లేదని గట్టిగా వాదించాడు. మిమ్ము చంపటానికి చక్రవర్తి అంగీకరించలేదు. మీ రెండు కళ్లూ పీకివెయ్యటానికి మాత్రం అతడు అంగీకరించాడు. ఈపని మూడు రోజులలో జరుగవచ్చు."

విషయమంతా చెప్పిన తరువాత ప్రముఖుడు రహస్యంగా నా గృహాన్ని వదిలి వెళ్ళిపోయాడు. నేను పక్కమీద పడుకుని ఏమేమో ఆలోచింప సాగాను. నాకంతా ఆశ్చర్యంగా వుంది. ఏవిధమైన హానీ జరుగకుండా నన్ను రక్షించుకోదం ఎలాగా అని తీవ్రంగా ఆలోచింపసాగాను. ఎలగూ బ్లెఫుస్కూ దీవికి ఒకసారి వెళ్ళాలని అనుకున్నాను గదా, ఇప్పుడే పోతే శ్రేయస్కరం అని ఆలోచింప సాగాను.

ఆలోచన రావటం ఏమిటి, దాన్ని వెంటనే ఆచరణతో పెట్టటం ఏమిటి, రెండూ ఒక్కసారే జరిగాయి. నేనివరకు బ్లెఫుస్కూ దీవినుండి తీసికొని వచ్చిన యుద్ధనౌకలలో ఒకదాన్ని సిద్ధం చేశాను. అందు నాకు కావలసిన కొన్ని వస్తువులు వుంచాను. సముద్రంలో కొంతదూరం నడిచి, కొంతదూరం ఈది బ్లెఫుస్కూ దీవి చేరుకున్నాను.

బ్లెఫుస్కూ ద్వీప వాసులు నా రాకకోసం ఎదురు చూస్తున్నారు. వారు రేవు పట్టణం వద్ద నాకు ఘనమైన స్వాగతం ఇచ్చారు. ఇద్దరు ద్వీపవాసులు దారి చూపెడుతుండగా నేను ముఖ్యపట్టణం చేరుకున్నాను. నారాక చక్రవర్తికి, ముఖ్యరాజోద్యోగులకు తెలియజేయబడింది. వెంటనే వారు పట్టణ ద్వారం వద్దకు వచ్చి నాకు అపూర్వ గౌరవ సత్కారాలు అందచేసారు. నేను వారికి నా కృతజ్ఞతను తెలియచేసాను.

నేను లోగడ చేసిన వాగ్దానం ప్రకారం లిల్లిపుట్ చక్రవర్తి అనుమతితో

అక్కడకు వచ్చానని చెప్పాను. ఆ ద్వీప చక్రవర్తికి కావలసిన సహాయం చేయటానికి సిద్ధంగా వున్నానని చెప్పాను. నాకు లిల్లిపుట్ ద్వీపవాసులు చేసు తలపెట్టిన అపకారాన్ని గూర్చి మాత్రం ఏమీ చెప్పలేదు.

నేను నివసించటానికి తగిన గృహం ఆ దీవిలో లేదు. అందుచేత నేను దుప్పటి ముసుగుపెట్టుకొని బయట నేలమీద నిదురించాను,

# 9

బ్లెఫుస్కూ దీవిలో మూడురోజులు నివసించాను. మరునాడు నేను సముద్ర తీరమున తిరుగసాగాను. అప్పుడు నాకు సముద్రంలో తిరుగబడ్డ పడవ వలె ఉన్న వస్తువు కనిపించింది. నేను వెంటనే చెప్పులు, మేజోళ్ళు తీసివేసి సముద్రంలో రెండు మూడు వందల గజాల దూరం నడిచి వెళ్ళాను అచ్చట నాకు నిజంగానే పడవ కనిపించింది.

వెంటనే నేను పట్టణానికి తిరిగివచ్చాను. చక్రవర్తితో చెప్పి, అతని అనుమతి పొంది ఇరవై ఓడలను,మూడువేలమంది నావికులను పడవవద్దకు తీసుకు వెళ్లాను. పడవను త్రాళ్ళతో నావలకు కట్టాను. నేను పడవ వెనుకకుపోయి చేతులతో దానిని ముందుకు త్రోయసాగాను. నావలలోనివారు దానిని తీరానికి ఈడ్చుకు పోతున్నారు. పడవను సముద్రతీరానికి నలభై గజాల దూరంవరకు తీసుకువెళ్ళాం.

నీరు తగ్గినపుడు త్రాళ్ళు. యంత్రాలసహాయంతో పడవను తిరగవేసాం ఆ పని చేయటంలో నాకు రెండువేలమంది ద్వీపవాసులు సర్వవిధాలా తోడ్పడ్డారు.

పడవ ఆ ద్వీపవాసుల దృష్టిలో ఒక అద్భుత సృష్టిగా ఉంది. నేను ద్వీప చక్రవర్తితో ఇలా అన్నాను: "చక్రవర్తీ! నా అదృష్టవశాన్న నాకీ పడవ దొరికింది. నేను ఈ పడవమీద ప్రయాణంచేసి నా మాతృదేశమయిన ఇంగ్లాండుకు వెళ్ళిపోతాను. దయతో మీరందుకు అంగీకరించవలసిందిగా ప్రార్థిస్తున్నాను. అంతే కాదు ఈ పడవను ప్రయాణానికి అనుకూలమయిన దానినిగా చెయ్యటానికి మీరు తగిన సహాయం చేయాలి."

చక్రవర్తి దయతో నా కోర్కెలకు తన సమ్మతిని తెలియజేసాడు. అందుకు నేను ఎంతో సంతోషించి అతనిని అభినందించాను.

ఈ లోపల లిల్లిపుట్ చక్రవర్తి నన్ను తమ దేశానికి తిరిగి పంపాలని బ్లెఫుస్కూ చక్రవర్తికి సందేశం పంపాడు అతడందుకు ఏమాత్రం అంగీకరించ లేదు సైగా నన్ను తమ దేశంలోనే ఉండవలసిందని కోరాడు. అట్లుండటానికి ఏమాత్రం వీలుపడదని చెప్పి, నన్ను క్షమించవలసిందని కడుదీనంగా ప్రార్థించాను. చక్రవర్తి దయతో నా కోరికను మన్నించాడు. నేనా దీవిని వదలిపోవటమే చక్రవర్తి అభిమతమనీ నాకు తరువాత తెలి సింది. సాధ్యమయినంత త్వరలో బ్లెఫుస్కూ దీవిని వదిలి వెళ్ళటానికే నిశ్చ యించుకున్నాను.

అయిదువందలమంది పనివాండ్రు పడవకు పనికివచ్చు రెండు తెర చాపలను తయారుచేసారు. నేను గట్టి త్రాళ్ళను తయారుచేసాను. చాల పొడవైన చెట్లను తెడ్లుగా తయారుచేశాను. తెరచాప కొయ్యలుగూడా తయారుచేశాను. లంగరు వెయ్యటానికి ఒక పెద్ద రాతిని సంపాదించాను.

పడవలో నాకు దూరప్రయాణానికి కావలసినంత మాంసం, రకరకాల ఆహారపదార్థాలు సేకరించుకున్నాను. ఆ దీవిలోని ఆవులు, ఎద్దులు, గొర్రెలు మొదలగు వాటినికూడా పడవలోనికి చేర్చాను. వాటికి కావలసిన గడ్డినికూడా సేకరించాను. కొంతమంది ద్వీపవాసులనుకూడా తీసుకుపోదలచానుగాని చక్రవర్తి అందుకు అంగీకరించలేదు.

నేను ఇంగ్లాండుకు బయలుదేరి పోవలసిన శుభదినం ఆసన్నమయింది. చక్రవర్తి, అతని కుటుంబంలోనివారు, ప్రముఖ రాజోద్యోగులు, పౌరశ్రేష్ఠులు మున్నగువారందరూ నాకు ఘనమయిన వీడ్కోలు ఇచ్చారు. చక్రవర్తి నాకు కొంత ధనం, తన పటం బహుమానంగా ఇచ్చాడు. నేను ఆ పటాన్ని జాగ్రత్తగా దాచుకున్నాను.

నా శక్తికొలది నాకు కావలసినవన్నీ సిద్ధం చేసుకొని క్రీ.శ. 1701, సెప్టెంబరు 24వ తేదీనాడు, ఉదయం ఆరుగంటలకు పడవమీద ఇంగ్లాండుకు బయలుదేరాను. సాయంకాలం అయ్యేసరికి ఒక చిన్న దీవిని చేరుకున్నాను. అచ్చట

సుమారు ఆరుగంటలకాలం విశ్రమించాను. తరువాత మరల ప్రయాణం కొంత సాగించాను.

రెండు రోజులు గడిచిపోయిన తరువాత నాకు దూరంగా పోతున్న పెద్ద ఓడ ఒకటి కనిపించింది. నేనా ఓడలోని వారిని గట్టిగా పిలిచాను. కాని ఓడ ఆగలేదు. అంటే ఓడలోని వారికి నా మాటలు వినబడలేదన్నమాట. నేను పడవను కడువేగంగా పోనిచ్చి ఓడను సమీపించాను. ఎట్టకేలకు ఓడలోనివారు నా పడవను, నన్ను చూచారు.

నేను ఓడకు అతిసమీపానికి వచ్చినపుడు నాకు కలిగిన ఆనందాన్ని ఏమని వర్ణించను? అది ఒక ఇంగ్లీషు ఓడ. దానిమీద ఆంగ్ల జాతీయపతాకం అత్యంత శోభాయమానంగా ఎగురుతోంది. దానిని చూచినపుడు నాకు అపరిమిత మయిన గర్వం కలిగింది ఆ ఓడ జపాను దేశంనుంచి ఇంగ్లాండుకు వెళుతోందని తెలుసుకొని ఎంతో సంతోషించాను.

నేను పడవలోనున్న జంతువులను నా జేబులలో పెట్టుకొని ఓడలోనికి వెళ్ళాను. ఓడ కెప్టెన్ నన్ను సాదరంగా ఆహ్వానించాడు. నేను అతనికి నా కథ నంతనూ సంపూర్ణంగా తెలియజేశాను. నా కథను నమ్మటానికి మొదట్లో అతడు నిరాకరించాడు. అపుడు నేను నా జేబులోవున్న జంతువులను బయటకు తీసి అతనికి చూపెట్టాను. నావద్దనున్న నాణెములను, చక్రవర్తి పటమునుకూడా చూపెట్టాను అపుడు కెప్టెన్ నా మాటలను నమ్మక తప్పలేదు.

కొన్ని దినాలకు ఓడ ఇంగ్లాండును చేరుకుంది. నేను నా మాతృదేశాన్ని తిరిగి చూడగలిగినందులకు ఎంతో సంతోషించాను. నావద్దనున్న జంతువులను ప్రముఖులకు చూపి డబ్బు సంపాదించుకోసాగాను. తుదకు ఆ జంతువులను ఆరు వేల పౌనులకు అమ్మివేశాను.

# 10

లిల్లిపుట్ దేశాన్ని, బ్లెపుస్కూ దీవిని విడిచిపెట్టి ఇంగ్లాండు చేరుకొని సుఖంగా కాలం గడపసాగాను. అప్పుడే రెండు నెలలు గడిచిపోయాయి. తిరిగి సముద్రప్రయాణం చేయవలెననే కోరిక మనసులో ప్రబలంగా అభివృద్ధి చెంద సాగింది.

"ఎడ్వెంచర్" అనే పేరుగల ఓడ సూరత్‌మీదుగా తూర్పు ఇండియా దీవులకు పోతున్నదనే విషయం నాకు తెలిసింది. వెంటనే దానికి సంబంధించిన వివరాలన్నిటినీ సేకరించాను. ఒక శుభముహూర్తాన నేను ఆ ఓడలో ప్రవేశించాను.

ఓడ ప్రయాణం ప్రారంభించింది. గాలివాటం దాని ప్రయాణానికి సర్వానుకూలంగా ఉంది. యాత్ర సజావుగా సాగుతోంది. వేళకు భోజనం, పానీయాలు చక్కగా సప్లయ్ అవుతున్నాయి. ఆటలతోను, పాటలతోను కాలం చక్కగా గడిచి పోతోంది.

చూస్తూ వుండగానే ఓడ ఆఫ్రికా దక్షిణ భాగాన ఉన్న గుడ్‌హోప్ అగ్రం చేరుకుంది. ఓడలో మంచినీటిని నిలవచేసికోవటం కోసం మేము అక్కడ ఆగాం. అంతలో ఓడ ఒకచోట చిల్లుపడిందనే విషయం గ్రహించాం. దానిని బాగు చేయించటానికి కొంతకాలం పట్టింది. ఈలోపల ఓడ కెప్టెన్ జబ్బుపడ్డాడు.అంచేత ఓడ చాలాకాలంవరకు బయలుదేరలేదు.

ఓడ తిరిగి ప్రయాణమై మడగాస్కరు దీవికి ఉత్తరభాగాన పోతుండగా గొప్ప గాలి బయలుదేరింది. అది సుమారు ఇరవైరోజులవరకు వీచిన తరువాత ఆగిపోయింది. మరునాడు గొప్ప తుఫాను మొదలయింది. మా ఓడ సరియైన మార్గం అనేది లేకుండా తన ఇష్టంవచ్చినట్లు పోసాగింది అందులో ఆహారపదార్థాలు పుష్కలంగా వున్నాయి. కాని మంచినీటికి కొంత ఏర్పడింది. అందువలన ఓడను ఒక పెద్ద దీవికి దూరంగా ఆపి, ఒక పడవను ఆ దీవివద్దకు పోనిచ్చాం. ఆ పడవలో పన్నెండుగురు మనుష్యులు ఉన్నారు. వారిలో నేనున్నానని ప్రత్యేకముగా చెప్పనక్కరలేదు.

దీవిలో ఎక్కడా మంచినీరు దొరకలేదు.నేను నా స్నేహితులను వదలిపెట్టి దీవిలో వేరొక ప్రదేశమునకు వెళ్ళాను. తిరిగి తిరిగి అలసిపోయి, పడవను ఆపినచోటుకు వచ్చాను. నా స్నేహితులు పడవపై ఓడదగ్గరకు వెళ్ళిపోతున్నారు, వారినొక మహాకాయుడు వెంబడిస్తున్నాడు.

నేనా దృశ్యం చూడలేక ఒక కొండపైకి ఎక్కాను. కొంతసేపైన తరువాత క్రిందకు దిగివచ్చి నడువసాగాను. ఒక బార్లీ చేనుగుండా పోసాగాను.ఆ చేను చుట్టూ కంచె సుమారు నూటఇరవై అడుగుల ఎత్తు ఉంది. చెట్ల ఎత్తునా ఊహకు ఏమాత్రం అందడంలేదు.

నేను ఒక పొలంలోనుండి మరియొక పొలంలోకి పోటానికి ప్రయత్నిస్తుండగా ఒక మహాకాయుడు కనిపించాడు. అతడు చర్చి గోపురమంత ఎత్తున్నాడు. అతని అంగ పదిగజాలు మించి వుంది. నేనతనిని చూచి అపరిమితమైన భయంతో ఒకచోట దాక్కున్నాను. అతడు కేక వేయగా ఉరుమువలె వినిపించింది. అతని కేకను విని ఏడుగురు సేవకులు అతనిని సమీపించారు. వారు అతనితో మాట్లాడి చేను కోయటానికి వెళ్ళారు. వారి చేతులలో పెద్ద పెద్ద కొడవళ్ళు వున్నాయి. వారు తమ యజమానుని వలెనే చాలా ఎత్తుగా ఉన్నారు.

సేవకులు చేను కోయసాగారు. నేను వారిని తప్పించుకోసాగాను. కాని తప్పించుకోటం నాకు చాలా కష్టంగా కనబడసాగింది. సేవకులు నన్ను సమీపించారు. అప్పుడు సముద్రప్రయాణం చేసినందుకు నన్ను నేను నిందించుకోసాగాను. పొట్టి మనుష్యుల లిల్లిపుట్ దేశంలో నా ప్రతాపాన్ని తలంచుకొని, ఈ రాక్షసుల (మహాకాయుల) ముందు నేను లిల్లిపుట్ (పొట్టి మనుష్యుడు) వలె ఉన్నానుకదా అని కన్నీరు మున్నీరుగా కార్చసాగాను.

ఒక సేవకుడు నన్ను చూడనే చూశాడు. ఒక అపాయకరమయిన

పురుగును పట్టుకునే విధంగా నన్నతడు పట్టుకొని పరిశీలించసాగాడు. నన్నతడు నేలపైకి విసిరివేస్తాడేమో అనే భయంతో చాలా వినయంగా మాట్లాడసాగాను. కొన్ని సంజ్ఞలు చేశాను. నా గొంతు అతనికి సంతోషం కలుగజేసింది. నన్నతడు ఒక వింత మృగాన్ని చూచినట్లు చూడసాగాడు. నేనతని వ్రేళ్ళమధ్య నలిగిపోతు న్నాను. నేను ఆ విషయమును ఆ సేవకునకు కొన్ని సంజ్ఞలద్వారా తెలియజేశాను అతడు నా బాధను సరిగా అర్థంచేసుకున్నట్లున్నాడు. నన్ను చాలా సున్నితంగా తన కోటుజేబులో పెట్టుకున్నాడు. వెంటనే నన్ను తన యజమానికి చూపెట్టటానికి కాబోలు నేను మొదట చూసినవాని వద్దకు పరుగెత్తుకుపోయాడు.

సేవకుడు నన్ను తన యజమాని చేతికిచ్చాడు. యజమానుడు మన చేతికర్రంత ఉన్న గడ్డిపరకనొకదానిని తీసుకొని నా జేబుపైనున్న గుడ్డలను పైకి తొలగించాడు. నా ముఖంపైగల వెంట్రుకలను పక్కకు తొలగించాడు. "ఇటువంటి వానిని మీరింతకుముందు ఎప్పుడయినా, ఎక్కడయినా చూసి యున్నారా?" అని యజమానుడు తన సేవకులను అడిగినట్లు నాకు తరువాత తెలిసింది. యజమానుడు నన్ను క్రిందకు దింపాడు. నేను అటు ఇటు నడువసాగాను. అందరూ నన్నే అత్యంతాశ్చర్యంతో చూడసాగారు.

నేను నెత్తిమీద టోపీ తీసి అతనికి నమస్కరించాను. కాళ్ళమీదపడ్డాను ప్రార్థించాను. యజమానుడు మాట్లాడినప్పుడు గొప్ప సవ్వడి అయింది. నా చేష్టల వలన నాకు జ్ఞానంకలదని యజమానుడు అర్థంచేసుకున్నాడు. అతడు ఒక భాషలో

మాట్లాడుతున్నాడు. నేను మరియొక భాషలో మాట్లాడుతున్నాను. మా ఇరువురి మాటలు ఒకరికొకరికి ఏమాత్రం అర్థంకావటంలేదు.

యజమానుడు తన జేబులోనుండి చేతి రుమాలు బయటకుతీసి రెండుగా మడిచి తన అరచేతిలో పెట్టుకున్నాడు. అరచేయి క్రిందపెట్టి నన్ను దానిపైకి రావలసిందని సంజ్ఞచేసాడు. నేను అతని కోరికప్రకారం చేసాను. పడిపోతానేమో అనే భయంతో మధ్యన పడుకున్నాను. యజమానుడు మిగిలిన గుడ్డతో నన్ను కప్పివేసాడు. పిమ్మట అతడు నన్ను తన గృహానికి తీసుకుపోయాడు.

యజమానుడు నన్ను తన భార్యకు చూపెట్టాడు. మొదట ఆమె దూరముగా వెళ్ళిపోయింది. పిమ్మట ఆమె నన్ను మచ్చికచేసుకోటానికి ప్రయత్నింపసాగింది.

యజమానుడు తన కుటుంబంతో భోజనానికి కూర్చున్నాడు. వారి బేబులు ముప్పది అడుగుల ఎత్తుంది. కుర్చీలు చాలా పెద్దవిగా వున్నాయి. భోం చేయటానికి ఉపయోగించే పళ్ళాలు ఇరవైనాలుగు అడుగుల చుట్టుకొలత కలిగి ఉన్నాయి. గ్లాసులు రెండు గ్యాలనుల నీరు పట్టేటంత వున్నాయి.నేను వారి బల్లకు మధ్య భాగంలో కూర్చున్నాను.

యజమానురాలు నాకు ఒక పెద్ద మాంసపు ముక్కను, ఒక పెద్ద రొట్టెముక్కను ఇచ్చింది. నేను వాటిని నా వద్దనున్న చాకుతో కోసుకొని తింటూ వుండగా చూసి అందరూ ఆనందించారు. వారిచ్చిన రెండు గ్యాలనుల ద్రాక్షసారా

యాన్నీ త్రాగివేసాను నేను వారికి నా కృతజ్ఞతను తెలియజేసాను వారు ఆనం దించి, నా చెవులు చిల్లులు పడునంత గట్టిగా నవ్వారు।

నన్ను తనవద్దకు రావలసిందని యజమానుడు సంజ్ఞ చేసాడు. నేను వెళుతుండగా యజమానుని పదేండ్ల కుమారుడు నా కాళ్ళను పట్టుకొని నన్ను గాలిలో వ్రేలాడదీసాడు. నాకు ఉక్కిరి బిక్కిరి అయిపోయింది. యజమానుడు నన్ను అతనివద్దనుంచి తీసుకున్నాడు. కుమారుని చెవి మెలిపెట్టాడు. అతనిని అచ్చటినుండి పొమ్మన్నాడు. కుమారుడు నాపై పగబూనుతాడని ఎంతో భయపడ సాగాను కుమారుని క్షమించవలసినదని సంజ్ఞల మూలమున యజమానుని కోరాను యజమానుడు నన్ను చక్కగా అర్థంచేసుకొని తన కుమారుని క్షమించాడు. నేను ఆ కుమారుని వద్దకుపోయి అతని చేతిని ముద్దుపెట్టుకున్నాను.

భోజనసమయాన నా యజమానురాలికి చాలా ప్రియమైన పిల్లి వచ్చింది. అది మన ఎద్దుకంటె మూడు రెట్లు పెద్దదిగా వుంది. యజమానుడు నన్ను దానివగ్గరకు తీసుకొనిపోయినపుడది నన్ను గమనించనే లేదు. భయాన్ని ప్రదర్శిస్తే అది నాకు హానిచేస్తుందని తలచి చాలా ధైర్యంగా వున్నాను. దాని ముందు అటు నిటు గంభీరంగా తిరగసాగాను. ఆ ఇంటిలో రెండు కుక్కలున్నాయి. ఒక్కొక్కటి నాలుగు ఏనుగులంత వుంది. నేను ఆ కుక్కలకు కూడా ఏమాత్రం భయపడలేదు.

భోజనమయినతరువాత ఒకదాది ఒక సంవత్సరం వయసుగల చంటి

పిల్లవానిని దీసుకువచ్చింది. అతడు నన్నొక ఆటవస్తువుగా తలచి నన్ను పట్టుకొని నా తలను నోట్లో పెట్టుకున్నాడు. అప్పుడు నేను గట్టిగా అరచాను. చంటిపిల్లవాడు నన్ను క్రిందకు వదలివేసాడు. యజమానురాలు నన్ను పట్టుకుంది గనుక సరిపో యిందిగాని లేకపోతే నేను అప్పటికప్పుడు పరలోక యాత్రచేసి వుండేవాడను.



నన్ను జాగ్రత్తగా చూడవలసిందని భార్యకు హెచ్చరికచేసి యజ మానుడు పొలంలోకి వెళ్ళిపోయాడు. భోజనం చేసింతరువాత నాకు నిద్రరాసాగింది.

అప్పుడు యజమానురాలు నన్ను తన పక్కమీద పరుండబెట్టి తెరచాపంత ఉన్న తన చేతి రుమాలును కప్పింది.

రెండు గంటలయినతరువాత నాకు మెలకువ వచ్చింది. అప్పుడు రెండు ఎలుకలు చప్పుడు చేస్తున్నాయి. ఒక ఎలుక నా ముఖందగ్గరకు వచ్చింది. రెండవ ఎలుక కొద్ది దూరంలో వుంది. నా కత్తితో ఆ రెండు ఎలుకలనూ ఎదుర్కొన్నాను ఒకదానితో ఘోరంగా పోరాడి చంపివేశాను. రెండో దానిని తీవ్రంగా గాయపర చాను. అది అంతట పలాయన మంత్రం పఠించింది. ఆ ఎలుకలే పెద్ద కుక్కంత ఉన్నాయి!

కొంచెంసేపు గడచిన తరువాత యజమానురాలు వచ్చింది. నేను చేసిన ఘనకార్యాన్ని ఆమెకు చూపెట్టాను. నాకు ఎటువంటి హాని కలగనందుకు ఆమె ఎంతో సంతోషించింది. చచ్చిన ఎలుకను సేవకురాలిచే బయట పారవేయించింది.

## 11

నా యజమానురాలికి తొమ్మిదేండ్ల వయసుగల ఒక కూతురు వుంది. ఆమె మంచి తెలివితేటలు కలది ఆమెవద్దగల ఆటబొమ్మకు పక్క ఒకటి వుంది. ఆ పక్కమీద నేను పడుకోటానికి ఏర్పాటు చేయబడింది. దానిని ఒక సొరుగులో వుంచి దూలానికి వ్రేలాడకట్టసాగారు. అందువలన నాకు ఎలుకల బాధ తగ్గింది.

యజమానుని కూతురు నాకు ఏడు చొక్కాలను కట్టి ఇచ్చింది. అవి మాసిపోయి నపుడు ఆమే వానిని పరిశుభ్రం చేస్తుండేది.

ఆమె నలభై అడుగుల ఎత్తుంది. ఆమెయే నాకు ఆ దేశ భాషను నేర్పసాగింది. అతిత్వరలో నాకు కావలసిన వస్తువులను ఆ దేశ భాషలో అడగ టం నేర్చుకున్నాను. ఆమె చాలా మంచిది. నన్నామె గ్రిల్‌డ్రిగ్ అని పిలిచేది. నేనామెను గ్లమ్‌డాల్‌కిచ్ అని పిలిచేవాడను. నేనాదేశంలో వున్నంతవరకు మేమిద్ద రం ఎప్పుడూ కలిసి మెలిసి వుండేవారం.

ఆ దేశంలోని ప్రజలు నన్నుగూర్చి వింత వింతగా చెప్పుకోసాగారు. నా చర్యలను వారు రకరకాలుగా వర్ణింపసాగారు. నా విషయం నా యజమానునకు సన్నిహితుడయిన ఒక రైతుకు తెలిసింది. అతడొకనాడు వచ్చి నన్ను పరిశీలనగా చూశాడు. నేను అతని కళ్ళు, కళ్ళజోడు చూసి పకపక నవ్వాను. అప్పుడక్కడ ఉన్నవారందరూ పక పక నవ్వారు.

ఆ రైతుకు నామీద అపరిమితమయిన ఆగ్రహం వచ్చింది. అతడు చాలా దుర్మార్గుడనీ, కుటిలుడనీ నేను సులభంగా గ్రహించాను. నన్ను అచ్చటకు సమీపాన వున్న పట్టణంలోని సంతలో వింత వస్తువుగా ప్రదర్శించి కావలసినంత డబ్బు సంపాదించవచ్చని ఆ రైతు నా యజమానికి సలహా ఇచ్చాడు. ఈ విష యం నా దాది (యజమానుని కూతురు)కి తెలిసింది.ఆమె నా క్షేమంగూర్చి దిగులు

పడసాగింది.నేను అగౌరవం చేయబడుతున్నానని అనుకుంటాననికూడా ఆమె భయ పడసాగింది.

మరునాటి ఉదయాన నేను, నా దాది, నా యజమానుడు సమీప పట్ట ణాన ఉన్న సంతకు వెళ్ళాం. నన్ను గాలి, కాంతి రావటానికి అన్ని విధాలా అను కూలంగా వున్న ఒక పెట్టెలో పెట్టారు. ప్రయాణంలో నేను బాగా అలసి పోయాను. మేము ఒక పూటకూళ్ళ ఇంట్లో బసచేశాము. నే నా పట్టణానికి వచ్చి నట్లు చాటింపు వేయించారు.

నన్ను ఒక పెద్ద గదిలో ఒక పెద్ద టేబిలుమీద వుంచారు. నాకు రక్ష ణగా దాది నాదగ్గరనే వుంది. నన్ను ఒక్కొక్కసారి ముప్పదిమంది మాత్రమే చూడటానికి అనుమతి ఇచ్చారు. నేను టేబిలుమీద అటు ఇటు నడవసాగాను దాది నన్ను ప్రశ్నలు వేయసాగింది. నేను ఆ ప్రశ్నలకు సముచితమైన సమాధానాలు ఇస్తుండేవాడను. నన్ను చూడటానికి వచ్చినవారికి వంగి వంగి నమస్కారం చేస్తుండే వాడను. అప్పుడప్పుడు పానీయాలు సేవింపసాగాను. అట్లే ప్రేక్షకులకు ఆనందం చేకూర్చే అనేక పనులు చేయసాగాను. ఆ విధంగా అనేకసార్లు చేసేసరికి నేను బాగా అలసిపోయాను.

నన్ను చూడటానికి వచ్చినవారెవరూ ముట్టుకొని హానిచేయటానికి వీలు లేకుండా తగిన కట్టుదిట్టాలు చేసారు. అన్ని చేసినప్పటికీ బడినుంచి వచ్చిన అల్లరి పిల్లవాడొకడు నాపైకి గుమ్మడికాయంత వున్న కాయనొకదానిని విసరి

వేశాడు. అది కొద్దిలో తప్పిపోయిందిగాని, లేకపోతే నా శిరస్సు పచ్చడి పచ్చడి అయిపోయివుండేది. నేను ఆ క్షణంలోనే మరణించి యుండేవాడను. అప్పటివారు ఆ అల్లరి పిల్లవానిని పట్టుకొని ఇకముందెప్పుడూ అటువంటి కొంటెపనులు చేయకుండా వుండేటట్లు గట్టిగా హెచ్చరించి తగిన విధంగా శిక్షించారు.

మరునాడు నన్ను ఇంటికి తీసుకొనిపోయారు.నన్ను చూడటానికి ఇంటి దగ్గరకుకూడా పలువురు రాసాగారు. అందువలన నా యజమానునకు విపరీతంగా ధనం రావటం మొదలుపెట్టింది. నన్ను దేశంలోని పెద్ద పట్టణాలకు తీసుకుపోయి ప్రజలకు చూపెట్టి, విపరీతంగా ధనం సంపాదించాలని నా యజమానుడు అనుకున్నాడు. ఆ ఉద్దేశ్యంతో అతడు దూరప్రయాణానికి కావలసిన ఏర్పాట్లన్నీ చేసుకున్నాడు.

క్రీ.శ. 1703 ఆగస్టు 17వ తేదీనాడు నేను, నా దాది,నా యజమానుడు బయలుదేరాం. మా గమ్యస్థానం మూడువేల మైళ్ళదూరాన ఉన్న రాజధానీ నగరం లార్‌బ్రల్ గ్రడ్, నా యజమానుడు నన్ను త్రోవలో పద్దెనిమిది పట్టణాలలోను, పెద్ద పెద్ద కుటుంబాల మధ్య ప్రదర్శించి, ఎంతో ధనం సంపాదించాడు. జనులు నా చేష్టలుచూసి, నా మాటలు విని ఎంతో ఆనందించారు. నా దాది నన్ను జాగ్రత్తగా సంరక్షిస్తోంది.సుమారు పదివారాలకు అనగా క్రీ.శ. 1703, అక్టోబరు 26వ తేదీనాడు మేము రాజధానీ నగరం చేరుకున్నాం.

నా యజమానుడు ముఖ్యవీధిలో పెద్ద గృహాన్ని ఒకదానిని అద్దెకు తీసుకున్నాడు. నా విషయం కరపత్రాలద్వారా అందరకూ తెలియజేసాడు. నన్ను ప్రదర్శించటానికి ప్రత్యేకమయిన ఏర్పాట్లు చేసారు. నేను నా శక్తి కొలది ప్రేక్షకులకు సంతోషం చేకూర్చటానికి ప్రయత్నింపసాగాను నేను అలసిపోతున్నప్పటికీ ఏమాత్రం లెక్క చేయటంలేదు. అందరూ ఆశ్చర్యసాగరంలో మునిగి తేలసాగారు రోజుకు పదిసార్లు ప్రదర్శన జరుగుతోంది. నేను నా దాది దగ్గర ఆ దేశ భాషను బాగా నేర్చుకుంటున్నాను. ఇది వరకు కంటె బాగా మాట్లాడగలుగుతున్నాను.

## 12

నాకు పని ఎక్కువయినకొలది శ్రమ ఎక్కువవుతోంది. శరీరంలో ఒకవిధమయిన బలహీనత ఏర్పడింది. నానాటికి చిక్కిపోయి అస్థిపంజరంవలె తయారయ్యాను. ఆదాయం ఎక్కువ అవుతున్నకొలదీ నా యజమానునకు దురాశ కూడా ఎక్కువ కాసాగింది. నేను త్వరలోనే మరణిస్తానని అతడు అనుకొన్నాడు. నేను మరణించకపూర్వమే సాధ్యమైనంత ఎక్కువ ధనం సంపాదించాలని అతడు నిశ్చయించుకున్నాడు.

ఒకనాడొక చిన్న రాజోద్యోగి నా యజమానుని దగ్గరకు వచ్చి నన్ను రాణీగారివద్దకు తీసుకురావలసిందిగా ఆజ్ఞాపించాడు. నా యజమానుడు నన్ను రాణీ

గారి దగ్గరకు తీసుకుపోయాడు. నన్ను చూసి రాణీగారు, ఆమె చెలికత్తెలు మున్నగువారందరు సంతోషించారు.

నన్ను రాణీగారి ముందు ఒక టేబులుమీద వుంచారు. నేను రాణీగారి వ్రేలును పలుమార్లు ముద్దు పెట్టుకున్నాను. ఆమె అడిగిన ప్రశ్నలన్నిటికీ చక్కని సమాధానాలు ఇచ్చాను. నన్ను తనదగ్గర వుండవలసిందని ఆమె కోరింది.

"నేను అస్వతంత్రుడను. స్వతంత్రుడనైతే మీరు కోరినప్రకారం చేస్తాను. మీ దగ్గర వుండటం నాకు ఎంతో ఆనందకరమయిన విషయం" అని నేను సవినయంగా సమాధానం ఇచ్చాను.

వెంటనే రాణి నా యజమానునకు వేయి బంగారు నాణెములు ఇచ్చి నా బాధ్యతను స్వీకరించింది. నేను రాణీగారు చెప్పినట్లు చేయటానికి అంగీకరించాను. నా దాదినికూడా తన పనిలోకి తీసుకోవలసిందిగా రాణీగారిని కోరాను. అందులకామె దయతో అంగీకరించింది. నా దాది తండ్రి అందుకు తన అంగీకారాన్ని ప్రకటించాడు. అప్పుడు నా దాదికి కలిగిన సంతోషాన్ని వర్ణించబూనితే హాస్యాస్పదమే అవుతుంది.

నేను నా పూర్వ యజమాని దురాశను, అవివేకాన్ని రాణీగారికి తెలియజేశాను. ఇంకా ఈ విధంగా అన్నాను: "నా పూర్వయజమాను నేను మరణిస్తానని తలచి మీకు నన్ను సులభంగా అమ్మివేశాడు. మీవంటి ఉదారులు నన్ను చక్కగా చూస్తారని నేను గాఢంగా విశ్వసిస్తున్నాను. మీకు నిజం చెబు

తున్నాను వినండి. మిమ్మల్ని చూడగానే నాకు పోయిన బలంలో సగం బలం తిరిగి వచ్చింది"



రాణి నా తెలివితేటలకు సంతోషించి నన్ను స్వయంగా రాజు వద్దకు తీసుకుపోయింది. నన్నొక టేబిలుమీద వుంచింది. రాణి కోరికపై నేను నా చరిత్రను రాజుకు క్లుప్తంగా తెలిపాను. నేను చెప్పిందంతా నిజమని నా దాది ధ్రువపరిచింది.

రాజు గొప్ప విద్యావంతుడు: గణితశాస్త్రవేత్త; తత్వశాస్త్రవేత్త. అతడు నన్ను మొదట ఒక ఆటవస్తువుగ భావించాడు. నా మాటలు విని అతడు ఆశ్చర్యపోయాడు.నన్ను పరిశీలించటానికి అతడు ముగ్గురు శాస్త్రవేత్తలకు కబురు పంపాడు. వెంటనే వారు వచ్చి నన్ను నిశితంగా పరీక్షించారు. వారు నన్నుగూర్చి రకరకాలుగా అభిప్రాయపడ్డారు.ఒక్క విషయంలో మాత్రమే వారికి నన్నుగూర్చి ఏకాభిప్రాయం కుదిరింది.

నేను కాలపరిపక్వానికి ముందే జన్మించానని ఒక శాస్త్రవేత్త అభిప్రాయ పడ్డాడు. మిగిలినవారు ఆ అభిప్రాయంతో ఎంతమాత్రం ఏకీభవించలేదు. నేను చాలా పొట్టిగానున్నానని, అందువలన నేను మరుగుజ్జునుకూడా కానని వారు అన్నారు. ఏమంటే రాణిగారి దగ్గరనున్న మరుగుజ్జు ముప్పది అడుగుల ఎత్తున్నాడు. చివరకు వారు నేను ప్రకృతిలో ఒక అసాధారణ సృష్టి వైచిత్ర్యమని తిరుగులేని నిర్ణయం చేశారు.

వారి నిర్ణయాన్ని విని, నేను నా నిజస్థితిని వారికి తెలిపాను. వారు నా మాటలను ఏమాత్రం నమ్మలేదు. నా పూర్వయజమానుడు ఆ మాటలను నాకు నేర్పాడని శాస్త్రవేత్తలు గట్టిగా అభిప్రాయపడ్డారు. కాని సూక్ష్మబుద్ధిగల రాజు ఇంకను ఆ పట్టణంలోనే యున్న నా పూర్వ యజమానుని పిలిపించి అతనితో రహస్యంగా మాట్లాడాడు. తరువాత అందరి ఎదుట మాట్లాడాడు. అతడు నేను చెప్పినదంతా నిజమని ధ్రువపరిచాడు.నేను నిజమే చెప్పానని రాజు గాఢంగా విశ్వ

పించి నన్ను జాగరూకతతో చూడవలసిందని రాణిగారికి చెప్పాడు. నా దాదిని కూడా నావద్దనే వుంచటానికి నిశ్చయించాడు.నా దాదికి సర్వసౌకర్యాలు సమకూర్చటానికి తగిన ఏర్పాట్లు చేసారు.



నాకు పడకగదిని తయారుచేయటానికి ఒక వడ్రంగిని నియమించారు. అతడు నా సూచనలను గ్రహించి శ్రద్ధతో ఒక చక్కని పడకగదిని తయారు చేసాడు. అందు నాకు కావలసిన సౌకర్యాలన్నీ వున్నాయి. లోపల ఒక మంచం, రెండు కుర్చీలు, రెండు బల్లలు, ఒక పెట్టె మొదలయినవి వున్నాయి. పడకగదికి ఒక తాళంకూడా ఏర్పాటు చేయబడింది.

నేను, రాణి ఒకచోటనే కూర్చుండి భోజనం చేస్తుండేవారం నేను దగ్గరలేకుండా రాణి భోజనం చేసేదికాదు. నేను భోజనం చేయటానికి ప్రత్యేకంగా వెండి పాత్రలు ఏర్పాటుచేశారు. రాణితోపాటు ఆమె కూతుళ్ళు ఇద్దరు (ఒక కూతురు వయసు పదహారు సంవత్సరాలు, రెండో కూతురు వయసు పదమూడు సంవత్సరాలు) కూడా భోజనం చేస్తుండేవారు. రాణిగారి భోజన పాత్రలు ఎంతో పెద్దవి. ఆమె సామాన్యమానవులు పన్నెండుమంది భుజించే ఆహారాన్ని ఒక ముద్దగా మింగేది. ఒక పీపా ద్రాక్షసారాయాన్ని ఒక్క గుటకలో మింగేది. నాకది అంతా చాలా చోద్యంగా వుండేది.

రోజులు గడుస్తున్న కొలదీ నేను రాజుగారి ప్రేమనుగూడా సంపాదించగలిగాను ప్రతి బుధవారం రాజు తన కుటుంబ సభ్యులందరితో కలసి భోజనం చేస్తుండేవాడు. అప్పుడతడు నన్ను తన ఎడమప్రక్కన కూర్చుండబెట్టుకుంటూవుండేవాడు. ఆ సమయంలో అతడు నాతో మాట్లాడుతూ మా దేశంగూర్చి చాలా ప్రశ్నలు వేస్తుండెడివాడు. నేను అన్నిటికీ సముచితంగా సమాధాన మిస్తుండేవాడను. అతడు ఏమేమో అంటూ వుండేవాడు.

ఒకనాడు నేను మా దేశంలోని వర్తక వ్యాపారాలు, రకరకాల యుద్ధాలు, మతకక్షలు, రాజకీయ పక్షాలు మొదలయినవానిని గూర్చి వివరంగా మాట్లాడాను. ఆ విషయాలను విన్నతరువాత రాజున కెంతో నవ్వువచ్చింది. అతడు తన ప్రక్కనే యున్న తన ప్రధానమంత్రితో మా దేశాన్ని తీవ్రంగా నిరసిస్తూ మాట్లాడసాగాడు.

నాకు మొదట చాలా కోపం వచ్చింది కాని క్రమంగా శాంతించాను. ఇన్నినాళ్ళు ఇక్కడ ఉన్నతరువాత నేనిప్పుడు ఇంగ్లాండులో వున్నవారిని చూడటం తటస్థిస్తే అలాగే నవ్వుతానని అనుకున్నాను.

ఒకొక్కసారి నేను నన్ను, రాణిగారిని అద్దంలో చూడటం తటస్థిస్తూ వుండేది. అప్పుడు ఆమెకు, నాకు గల తేడా బాగా అర్థమవుతూ వుండేది. నేను ఎంతో అల్పుడనని భావించి నాలో నేను నవ్వుకుంటూ వుండేవాడను. నా మాతృ దేశంలోని ప్రజల అజ్ఞానమునకు, అహంభావమునకు ఎంతో విచారపడుతూ వుండే వాడను.

నాకు రాణిగారి మరుగుజ్జుతో మాత్రం చాలా బాధగా వుండేది. అతడు ఆ దేశంలో కెల్లా పొట్టివాడు. అయినప్పటికీ నాకంటే పొడవుగా వుండటంచేత నావద్ద తన గర్వాన్ని వీలుచిక్కినప్పుడల్లా ప్రకటిస్తుండేవాడు. నేను అతనిని అంతగా లెక్కచేయక మాట్లాడుతుండేవాడను. ఒకనాడు అతనికి నామీద అపరి మితమయిన ఆగ్రహం వచ్చింది. అప్పుడతడు నన్ను పట్టుకుని ఒక తైలపాత్రలో పడవేశాడు. నాకు బాగా ఈత రావటం వలన నేను అందులో మునిగిపోలేదు. అంతలో నా దాది వచ్చి పైకి తీసి రక్షించింది. నా దుస్తులు మాత్రం పాడై పోయాయి. రాణిగారు మరుగుజ్జును బాగుగా కొట్టించి, ఎవరికో ఇచ్చి పంపివేసింది ఆనాటినుంచి మరుగుజ్జు నాకు మరల కనిపించలేదు.

ఆ దేశంలో ఈగలు మన భరద్వాజ పక్షి అంత వుండేవి. అవి నేను

భోజనం చేస్తున్నప్పుడు, చప్పుడు చేస్తూ బాధపెడుతుండేవి. అవి అప్పుడప్పుడు నా మొగంమీద వాలుతుండేవి. నేను వాటిని పట్టుకొని నా కత్తితో ముక్కలు ముక్కలు చేస్తుండేవాడను. రాణీగారు నా నైపుణ్యాన్ని ఎంతో ప్రశంసిస్తుండేది. కందిరీగలుకూడా పెద్దవిగా వుండేవి. అవి నా రొట్టెను ముక్కలు ముక్కలుచేసి తీసికొని పోతుండేవి. ఒకనాడు నేను అంతులేని ఆగ్రహంతో నాలుగు కందిరీగలను పట్టుకొని చంపివేసాను.

# 13

నాకా దేశంలో జీవితం సుఖంగా గడిచిపోతోంది. కాని నేను అప్పుడప్పుడు కొన్ని అపాయలకు లోనుకావలసిన సన్నివేశాలు జరుగుతుండేవి.ఒకనాడు రాణీగారి వద్దనుంచి వెళ్ళిపోకపూర్వం మరుగుజ్జు, నేను, నా దాది ఒక తోటలో కూర్చున్నాం. నేనో చెట్టుక్రింద వున్నాను. అప్పుడు మరుగుజ్జు చెట్టు దులిపాడు. పీపా అంత వున్న ఆపిలుపండ్లు క్రిందపడ్డాయి. ఒకపండు నాకు కొద్దిగా తగిలి క్రిందపడింది. దైవానుగ్రహంచేత అప్పటికింక ఎటువంటి ఆపదా కలగలేదు.

ఒకనాడు నేను నా దాదికి దూరంగా నిలబడి యుండగా నామీద పెద్ద వడగళ్ళు పడ్డాయి. అవి సామాన్యపు వడగళ్ళ కంటె సుమారు పద్దెనిమిదివందల

రెట్లు పెద్దవిగా వున్నాయి. వాటి బాధకు నేను పదిరోజులవరకూ బయటకు రాలేక పోయాను.

ఒకనాడు దాది నన్ను తోటలో ఒకచోట వుంచి ఎప్పటికో వెళ్ళిపోయింది. అప్పుడొక తెల్లని కుక్క వచ్చి నన్ను నోటకరచుకొని తన యజమాను డగు తోటమాలివద్దకు వెళ్ళింది.తోటమాలి నన్ను ఎరిగివున్నవాడవటంచేత వెంటనే విడిపించాడు. నాకు ఎటువంటి బాధా కలుగలేదుగాని భయంచేత నోటివెంట మాట రాలేదు. అంతలో నన్ను వెదుక్కుంటూ దాది అక్కడకు వచ్చింది. నా పరిస్థితి తెలుసుకొని ఎంతో విచారించింది. ఈ విషయం రాణిగారికి తెలిస్తే కోపగిస్తుందని ఆమెకు చెప్పలేదు. మరియొకపుడు గ్రద్ద ఒకటి నన్ను ఆకాశంలోకి తీసుకుపోయి వుండేదేగాని కత్తితో బెదిరించటంచేత అది పారిపోయింది.

ఆ దేశంలోని చిన్న చిన్న పక్షులు నన్ను చూచి భయపడుతుండేవికావు అవి నా చేతిలోని రొట్టెముక్కలను అతిసులభంగా ఎత్తుకుపోతుండేవి. నేను వాటిని పట్టుకోటానికి ప్రయత్నించినపుడు నన్ను గాయపరుస్తుండేవి. ఒకరోజున నేనొక పక్షిని పడగొట్టి విజయగర్వంతో దాదివద్దకు వెళుతున్నాను. అప్పుడా పక్షి తిరిగి బలం తెచ్చుకొని నన్ను రెక్కలతో కొట్టసాగింది. అంతలో ఒక సేవకుడు వచ్చి దాని మెడను నులిమివేసాడు.

నాయందు ఎంతో ప్రేమ, దయకల రాణి నాకోసం ప్రత్యేకంగా ఒక పడవను తయారుచేయించి ఇచ్చింది. నేనా పడవపైకి ఎక్కి కూర్చుండి ఒక చిన్న

తటాకంలో అటు నిటు తిరుగుతుండేవాడను. ఒకరోజున సేవకుని పొరపాటువలన పెద్ద కప్ప ఒకటి పడవలో దూరి, పడవను ఒక వైపుకు వంచివేయసాగింది. నేను నా శక్తి అంతా వుపయోగించి పడవ తిరగబడకుండా ఆపుచేయగలిగాను.

ఒకనాడు చాలా అపాయకరమయిన సంఘటన జరిగింది. ఆ దినాన నా దాది నన్నొక గదిలో కూర్చుండబెట్టి ఎచ్చటికో వెళ్ళిపోయింది. అప్పుడా గది లోనికి ఒక కోతి ప్రవేశించింది. అది నన్ను చూచి గట్టిగా పట్టుకొని తన ఒడిలో కూర్చుండబెట్టుకుంది. అది నన్నొక కోతిపిల్లగా భావించి అలా చేసిందనుకుంటాను అంతలో ఏదో చప్పుడు వినిపించింది. కోతి గబ గబ బయటకు వెళ్ళి పక్కనున్న ఇంటిపైకి ఎక్కింది.

ఇది అంతా నా దాది చూచి ఒక్క గావుకేక పెట్టింది. ఆ కేక విని పలువురు జనులు పరుగెత్తుకు వచ్చారు. సేవకులు నిచ్చెనల కోసం పరుగెత్తారు. కొందరు కోతిపైకి రాళ్లు విసిరారు. కాని రాళ్ళు నాకే తగిలి మరణిస్తానేమో అని రాళ్లు విసరరాదని హెచ్చరిక చేయబడింది. సేవకులు నిచ్చెనలు వేసుకొని ఇంటిపైకి ఎక్కసాగారు. కోతి ఇది అంతా చూస్తూనే వుంది. నన్ను మెల్లిగా ఒక పెంకు మీద జారవిడిచింది. అపుడు నా పరిస్థితి ఎంతో భయానకంగా వుంది. ఏమంటే అప్పుడు నేను భూమికి అయిదువందల గజాల ఎత్తున వున్నాను. ఏ క్షణంలోనైనా గాలి వీచి క్రిందకు పడిపోయే ప్రమాదంలో మునిగియున్నాను. కాని అవిధంగా

జరగకముందే ఒక సేవకుడు వచ్చి నన్ను పట్టుకొని తన జేబులో పెట్టుకొని క్రిందకు దిగిపోయాడు.

ఆ దురదృష్టకర సంఘటన జరిగిన తరువాత పదిహేను రోజులవరకు నేను మంచంమీదనుంచి క్రిందకు దిగలేదు. రాజదంపతులు ప్రతిరోజు వచ్చి నా యోగక్షేమాలు తెలుసుకుంటూ వుండేవారు. నేను ఆరోగ్యం కోలుకొన్న తర్వాత జరిగిన విషయంగూర్చి నాతో హాస్యాలాడుకుండేవారు.

నేను సాధ్యమైనంతవరకు నా మాటల మూలాన, చర్యలమూలాన రాజ దంపతులకు సంతోషం చేకూర్చటానికి ప్రయత్నింపసాగాను. నేను వారి వెంట్రుకలతో రకరకాల వస్తువులు తయారుచేసి రాణికి బహూకరించాను. రాజు నా మాతృదేశాన్ని అప్పుడప్పుడు తీవ్రంగా విమర్శిస్తుండేవాడు. నేను నా దేశాన్ని గట్టిగా సమర్థిస్తూ మాట్లాడినప్పుడతడు పక పక నవ్వుతుండేవాడు. నేనాతనికి తుపాకులను గూర్చి, తుపాకి మందును గూర్చి తెలియజేశాను. వాని సహాయంతో ఇతర రాజ్యాలను జయించవచ్చునని చెప్పి, వాటిని తయారుచేసే విధానం తెలుపుతానన్నాను. తన రాజ్యం పోయినా సరేగాని, అటువంటి మారణాయుధాలు ఉపయోగించటానికి అంగీకరించనని రాజు ముక్త కంఠంతో అన్నాడు. అటువంటి మాటలను ఇకముందెప్పుడూ తన సమక్షంలో తీసుకురావద్దని కూడా గట్టిగా హెచ్చరించాడు.

రాజుగారి గ్రంథాలయంలో సుమారు ఒక వెయ్యివరకు పుస్తకా

లున్నాయి. నేను నిచ్చేనల సహాయంతో చరిత్ర, నీతి శాస్త్రాలకు సంబంధించిన కొన్ని గ్రంథాలు చదివాను. అవి ఎంతో బాగున్నాయి.

ఆ దేశంలో వర్తక వ్యాపారాలు చేసేవారు, వ్యవసాయం చేసేవారు సైనికులుగాకూడా పనిచేసేవారు వారు ఏటువంటి నిర్బంధం లేకుండా, ఐచ్ఛికంగా ఆ పనిని చేసేవారు.

# 14

నేను మహాకాయుల (రాక్షసుల) దేశమయిన బ్రాబ్డింగ్ నాగ్‌కు వచ్చి రెండు సంవత్సరాలు గడిచిపోయాయి. మూడవ సంవత్సరం ప్రారంభమయింది. నేను ఎప్పటికయినా ఆ దేశం విడిచిపెట్టి, స్వదేశానికి వెళ్ళాలనే అనుకుంటూ వున్నాను.

ఒకనాడు రాజదంపతులతో నేను, నా దాది ఆ రాజ్యంలోని దక్షిణ తీరానికి ప్రయాణమై వెళ్ళాం. సముద్రతీరానికి పద్దెనిమిది మైళ్ళ దూరంలో వున్న విశ్రాంతి భవనంలో బస చేసాం. నాకప్పుడు పడిసెం పట్టింది. దాదికికూడా జబ్బు చేసింది. అప్పుడు నేను ఒక సేవకునితో కలిసి సముద్రతీరానికి వెళ్ళాలని అనుకున్నాను. నా దాది అందుకు బలవంతంమీద అంగీకరించింది.

నన్ను నా పెట్టెయందు వుంచి సేవకుడు సముద్రతీరానికి తీసుకు

వెళ్ళాడు. పెట్టెను ఒకచోట వుంచి పక్షి గ్రుడ్లను ప్రోగుచేసుకోటానికి సమీపము నవే ఉన్న కొండలలోనికి వెళ్ళిపోయాడు.



కొంతసేపైన తరువాత నా పెట్టె గాలిలోనికి లేచింది. చాలా పైకి లేచింది. పిమ్మట అపరిమితమయిన వేగంతో ముందుకు సాగిపోతుంది. నేను ఎన్నో కేకలు వేయసాగాను. ఎవ్వరూ పలుకలేదు. ఎవ్వరూ సమాధానం ఈయ

లేదు. నా పెట్టెపై పక్షి రెక్కల సవ్వడిమాత్రం వినిపిస్తోంది. ఏదో ఒక పెద్దపక్షి నా పెట్టెను తీసుకుపోతుందని గ్రహించాను.

అంతలో పెద్ద సవ్వడి వినిపించింది. క్షణంలో నేను తిన్నగా క్రిందపడి పోతున్నట్లు తోచింది. పెట్టె సముద్రంలో పడి తేలుతూ ముందుకు సాగిపోతోంది. ఆ పెట్టె సముద్రంలో అయిదడుగుల లోతు వరకు మునిగివుంది. నా పెట్టెను తీసుకొని పోతున్న పక్షిని మరికొన్ని పక్షులు తరిమినవనీ, అందువలన అది ఆ పెట్టెను వదిలి పెట్టిందనీ అనుకున్నాను.

నేను సహాయంకోసం పెట్టెలోనుంచి అఱవసాగాను. కొంతసేపు గడిచిం తర్వాత నా పెట్టెను ఎవరో ఈడ్చుకు పోతున్నట్లు అనిపించింది. మరి కొంతసేపైన తరువాత పెట్టె పైకి లేచింది.

అప్పుడు నాకు ఈ మాటలు వినిపించాయి: "ఈ పెట్టెలో ఎవరైనా మనుష్యులు ఉంటే వెంటనే మాట్లాడ వలసిందిగా కోరుతున్నాం."

వెంటనే నేను ఇలా అన్నాను: "నేనొక ఆంగ్లేయుడను. దురదృష్ట వశాన తీవ్రమైన దుస్థితిలో మునిగిపోయాను. అట్టి స్థితిని ఇదివరకు ఏ మనుష్యుడు గాని అనుభవించి యుండలేదని గట్టిగా నమ్ముతున్నాను. నేను ఈ పెట్టెలో గ్రమ్మగి బాధపడుతున్నాను నన్ను దయయుంచి వెంటనే బయటకు తీయ వలసిందిగా ప్రార్థిస్తున్నాను."

అపుడు నాకు జవాబు వినబడింది: "నీవు ఇప్పుడు క్షేమంగానే ఉన్నావు. నిన్ను త్వరలోనే బయటకు తీస్తాం. ఏమాత్రం విచారించవద్దు."

కొన్ని నిముషములైన తర్వాత ఒక వడ్రంగి వచ్చి నా పెట్టెకు పైన ఒక పెద్ద రంధ్రం చేశాడు. లోనికొక నిచ్చెన వేయబడింది. నేను ఆ నిచ్చెనను వుపయోగించి బయటకు వచ్చాను.

నేను చాలా నీరసంగా ఉన్నాను. నా పరిస్థితిని గ్రహించని నావికులు పలువురు రక రకాలుగా ప్రశ్నలు వేయసాగారు. ప్రశ్నల వర్షం ధారాపాతంగా కురుస్తుందనే చెప్పొచ్చు. నేను మాత్రం మూర్ఛలో మునిగిపోవటానికి సిద్ధంగా ఉన్నాను.

ఓడకెప్టెను నా పరిస్థితిని గ్రహించి; నాకొక చక్కని పానీయాన్ని ఉచ్చాడు. దానిని త్రాగి ఒక పక్కమీద గాఢంగా నిదురించాను. కొన్ని గంటల సేపు నిదురించిన తరువాత నా శరీరారోగ్యం చక్కబడింది. అప్పటికి రాత్రి ఎనిమిది గంటలు అయింది. కడు దయాపరుడైన కెప్టెన్ నాకప్పుడు చక్కని భోజనం పెట్టాడు. నా పెట్టెను చూచిన వైనాన్ని, దాన్ని ఓడకు కట్టిన వైనాన్ని కెప్టెను నాకు పూర్తిగా తెలియజేసాడు. నేనతనికి నా హృదయపూర్వకమగు కృతజ్ఞతను తెలిపాను.

కెప్టెను నా పూర్తి కథను వినగోరాడు నేను కడసారి ఇంగ్లాండును వదిలిపెట్టినప్పటినుండి, ఆతడు నన్ను మొదట చూసేవరకూ జరిగిన విషయాల నన్నింటినీ సవిస్తరంగా చెప్పాను. కెప్టెను ఓపికతో నేను చెప్పిందంతా విన్నాడు. అంతేకాదు. నేను చెప్పిన విషయాలన్నీ పూర్తిగా

నిజమైనవని అతడు గట్టిగా నమ్మాడు. నేనింకా రుజువుకోసం నాపెట్టెలో నున్న వస్తువుల నన్నింటినీ అతనికి చూపించాను. నేను అతనికి ఒక ఉంగరాన్ని బహూకరించాలని అనుకున్నాను గాని అతడు దానిని స్వీకరించడానికి నిరాకరించాడు. నావద్ద ఒక సేవకుని దంతం ఒకటి వుంది. అది సుమారు అడుగు పొడవుంది. కెప్టెన్ దానిని మాత్రం నావద్దనుంచి తీసుకున్నాడు.

బ్రాబ్డింగ్ నాగ్‌లోని నా అనుభవాల నన్నింటినీ ఇంగ్లాండ్‌లో పుస్తక రూపాన ప్రచురింప వలసిందని కెప్టెను నాకు సలహా యిచ్చాడు. నా అపూర్వ అనుభవాలను అతడెంతో ఘనంగా ప్రశంశించాడు. పుస్తక రూపాన ప్రచురించే విషయం గూర్చి ఆలోచిస్తానని అన్నాను. నా అనుభవాలను గూర్చిన ప్రశంసా వాక్యాలకు వినయంతో కూడిన కృతజ్ఞతను తెలిపాను.

మా ఓడ ఎటువంటి ఆపదలు లేకుండ ప్రయాణంచేసి క్రీ.శ. 1706, జూన్ 3వ తేదీనాడు డౌన్సు నగరం చేరుకుంది. నేనక్కడ ఓడనుంచి దిగాను. రేడిఫ్‌లోనున్న మా ఇంటికి రావలసిందిగా కెప్టెనును ఆహ్వానించాను...

నేను రోడ్డుపై నడుస్తున్నప్పుడు, మహాకాయుల రాక్షస లోకంనుండి వచ్చిన నాకు, అచ్చటి గృహాలు, చెట్లు ఎంతో చిన్నవిగా కనిపించసాగాయి. అది లిల్లీపుట్ లోకమని అనుకోసాగాను. త్రోవను నడుస్తున్నవారు నా కాళ్ళక్రిందపడ నలిగిపోతారని భ్రమించి వారిని దూరంగా పొమ్మని అరవసాగాను. వారందరూ నేను అహంభావంతో ప్రవర్తిన్నానని అనుకొన్నారు.

ఎట్టకేలకు నా గృహం చేరుకున్నాను. ఒక సేవకుడు తలుపులు తెరి

వాడు. గుమ్మం పై భాగం నెత్తికి తగిలి బొప్పికడుతుందని భ్రమించి వంగి లోపలకు పోయాను. నా భార్య నన్ను కలుసుకోటానికి వేగంగా వచ్చింది. నేనామె మోకాళ్ళవరకు వంగాను. అలా చేయకపోతే ఆమె నన్ను ముద్దుపెట్టుకోటానికి వీలుండదని అనుకున్నాను.నా కూతురు ఆశీర్వాదం కోసం నాముందు మోకరిల్లింది ఆమె లేచి నిలబడేవరకు నేనామెను చూడనేలేదు. ఏమంటే నేను అంతవరకు తల, కన్నులు పైకెత్తి అరవై అడుగుల ఎత్తున్న మహాకాయులను చూడటానికి అలవాటు పడి వున్నానుగదా!

నేను గదిలోకి పోయి అచ్చటనున్న స్నేహితులను, సేవకులను పొట్టి వారని భావించి, ఒక మహాకాయుని (రాక్షసుని) వలె వారిని చూడసాగాను. నా ప్రవర్తనను చూచి అందరూ నాకు మతిపోయిందని భావించసాగారు.

ఇది అంతా అలవాటు ప్రభావం అని ప్రత్యేకంగా చెప్పవలసిన పని లేదు. ఈ అలవాటునుండి తప్పించుకోటానికి నాకు కొంతకాలం పట్టింది.

“మీరింక సముద్రప్రయాణం చేయనని వాగ్దానం చేయండి” అని నా ప్రియమైన భార్య నన్ను కోరింది.

నేను ఆ క్షణాన అలాగే వాగ్దానం చేసాను. కాని దైవ నిర్ణయం ఎలా వుందో! కాలమే నిర్ణయిస్తుంది.

